శ్రీమద్రామాయణము

# సుందరకాండము

ఆంధ్ర తాత్పర్య విశేషాంశములతో



శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు

# శ్రీవైష్ణవులు శ్రీమద్రామాయణపారాయణకు ముందు పఠించవలసిన శ్లోకములు

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్,
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్. 1

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్,
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్. 2

యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ, వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో, రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే. 3

మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా. 4

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ, శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్, శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్. 5

**అథ శ్రీశైలపూర్ణవిషయమ్–**

పితామహస్యాపి పితామహాయ, ప్రాచేతసాదేశఫలప్రదాయ,
శ్రీభాష్యకారోత్తమదేశికాయ, శ్రీశైలపూర్ణాయ నమో నమః స్తాత్. 6

ఇతి శ్లోక మారభ్య శ్రీభాష్యకారప్రభృతి స్వాచార్యపర్యంతవిషయా స్సాంప్రదాయికాః శ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్యప్రభృతి శ్రీధరపర్యంత ప్రతివ్యక్తివిషయాః శ్లోకా అనుసంధేయాః.

**విష్వక్సేనధ్యానమ్–**

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్,
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే. 2

శ్రీహయగ్రీవధ్యానమ్-
జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే. 1

అభంగురకలాదాన స్థూలలక్షత్వ మీయుషే,
తుంగాయ మహసే తస్మై తురంగాయ ముఖే నమః. 2

వాల్మీకిధ్యానమ్-
కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 3

ఆంజనేయప్రార్థనా-
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందే ऽనిలాత్మజమ్. 1

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 2

ఆమిషీకృతమార్తాండం గోష్పదీకృతసాగరమ్,
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమా మ్యహమ్. 3

మనోజవం మారుతతుల్యవేగం, జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం, శ్రీరామదూతం శిరసా నమామి. 4

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం, యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం, నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 5

ఆంజనేయ మతిపాటలాననం, కాంచనాద్రి కమనీయ విగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం, భావయామి పవమాననందనమ్. 6

యత్ర యత్ర రఘునాథకీర్తనం, తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం, మారుతిం నమత రాక్షసాంతకమ్. 7

**శ్రీరామాయణప్రార్థనా-**

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా. 1

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 2

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్. 5

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్ పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్. 6

తదుపగతసమాససంధియోగం, సమమధురోపనతార్థవాక్యబద్ధమ్,
రఘువరచరితం మునిప్రణీతం, దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 7

**శ్రీరామప్రార్థనా-**

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం, సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్,
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం, రామం నిశాచరవినాశకరం నమామి. 8

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం

వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 9

*తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కార్యమ్.*

అథ

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్.
తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్.

ఇతి శ్లోకద్వయం పఠిత్వా 'శ్రీరఘునందనపరబ్రహ్మణే నమః'
ఇత్యుక్త్వా పారాయణ మారభేత.

## పారాయణసమాప్తిలో పఠించవలసిన శ్లోకములు

ఏవ మేతత్ పురావృత్త మాఖ్యానం భద్రమస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్. 1

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః. 2

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః. 3

కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్. 4

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం, న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం, లోకా స్సమస్తా స్సుఖినో భవంతు. 5

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 6

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్. 7

విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,

భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్. 8

పితృభక్తాయ సతతం భ్రాతృభిః సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్. 9

త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్. 10

సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్. 11

దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్. 12

సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్. 13

హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనా యాస్తు మహాధీరాయ మంగళమ్. 14

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్. 15

ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్. 16

మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్. 17

కాయేన వాచా మనసేంద్రియై ర్వా, బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై, నారాయణాయేతి సమర్పయామి. 18

*తతః పితామహస్యే త్యారభ్య స్వాచార్యపర్యంతశ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్య మారభ్య శ్రీధరపర్యంతగురుపరంపరాఽనుసంధేయా. సీతావివాహపట్టాభిషేక సర్గయోస్తు 'ఇయం సీతా మమ సుతా' 'అభ్యషించ న్నరవ్యాఘ్రమ్' ఇతి శ్లోకపఠనాత్ పూర్వం మధ్యే విశేషతో భగవదారాధనం చ కర్తవ్యమ్.*

-----

# సుందరకాండ పారాయణ పద్ధతులు

విషయసూచిక

## పారాయణ విధానములు - 2

శ్రీమతే రామానుజాయ నమః

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.

శ్రీమద్రామాయణే

# సుందరకాండః

## 1. ప్రథమః సర్గః

*(హనుమంతుని సముద్రలంఘనము)*

తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః,
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి. 1

అంతట (జాంబవంతుడు ప్రోత్సహించిన పిమ్మట) స్వకార్యము (సీతాన్వేషణము) నకు విరోధులను రూపుమాప సమర్థుడగు హనుమంతుడు, రావణు డపహరించిన సీతాదేవి యున్న తావును, చారణులు (గుంపుగా సంచరించు దేవగాయకులు) తిరుగాడు ఆకాశమార్గమున పోయి వెదుక దలంచెను. 1

విశే. కిష్కింధాకాండమున భగవంతునియందు మాత్రమే ఉండెడి సకల కల్యాణ గుణాకరత్వము చెప్పబడినది. ఈ సుందరకాండమం దాయనకు గల సర్వసంహారకత్వరూపమగు గుణము చెప్పబడుచున్నది. లేదా పూర్వకాండమున సర్వథా మిత్రులను కాపాడవలెనని చెప్పబడినది. ఇందు దూతయు, పతివ్రతయు ఎట్లు నడచుకొనవలెనో వివరింపబడినది. లేదా పూర్వకాండమున సర్వరక్షణప్రవృత్తుడైన విష్ణునికి ఆచార్యరూపమగు పురుషకారము లభించుట చెప్పబడినది. ఈ కాండమున అచార్యుని కృత్యము చెప్పబడుచున్నది. లేదా పూర్వకాండమున హనుమంతుడు మనస్సంకల్పముతో బయలుదేరుట చెప్పబడినది. ఇందు

దుష్కరం నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః,
సముదగ్రశిరోగ్రీవో గవాం పతి రివాబభౌ. 2

అథ వైడూర్యవర్ణేషు శాద్వలేషు మహాబలః,
ధీర స్సలిలకల్పేషు విచచార యథాసుఖమ్. 3

ద్విజాన్ విత్రాసయన్ ధీమా నురసా పాదపాన్ హరన్,

---

అన్యుల కలవికాని సముద్రలంఘన మను కార్యమును నిరంతరాయముగ చేయ సమకట్టినవాడై హనుమంతుడు తల పైకెత్తి, మెడ చాచి, ఆబోతు వలె విరాజిల్లెను. 2

అంతట ధీరుడు, మహాబలుడగు హనుమంతుడు కొంచెము తెలుపుతో కూడిన ఆకుపచ్చరంగు (వైడూర్యవర్ణము) కలవై, చల్లదనముచే నీటిని పోలుచున్న పచ్చికబయళ్లపై సుఖముగా సంచరించెను. 3

ధీమంతుడగు హనుమంతుడు అట్లు విజృంభించిన సింహమువలె

---

శరీరముతో బయలుదేరుట వర్ణింపబడుచున్నది.

ఈ కాండమున ప్రధానపురుషుడగు ఆంజనేయస్వామి గురుస్థానీయుడు. ఆయన శత్రుకర్శనుడు. జ్ఞానము నిచ్చువాడు గురువు. ఆ జ్ఞానమునకు విరోధి అజ్ఞానము. దానిని పారద్రోలువాడు హనుమంతుడు.

'గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః,
అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే.'

గు–అనగా అంధకారము (అజ్ఞానము). రు–అనగా నిరోధించువాడు. అంధకారమును

3
మృగాంశ్చ సుబహూన్ నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ. 4
నీలలోహితమాంజిష్ఠ పత్రవర్ణై స్సితాసితైః,
స్వభావవిహితై శ్చిత్రై ర్ధాతుభి స్సమలంకృతమ్. 5
కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః,
యక్షకిన్నరగంధర్వై ర్దేవకల్పైశ్చ పన్నగైః. 6
స తస్య గిరివర్యస్య తలే నాగవరాయుతే,
తిష్ఠన్ కపివర స్తత్ర హ్రదే నాగ ఇవాబభౌ. 7
స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే,
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్. 8

---

విహరించుచుండగా అతని రొమ్ము తాకి చెట్లు కూలెను. ఆ చెట్ల నాశ్రయించియున్న పక్షులు బెదరెను. మృగములు (భీతిల్లి) చెల్లాచెదరై నశించెను. 4

నల్లనివి, ఎఱ్ఱనివి, పసుపువన్నె కలవి, ఆకుపచ్చరంగు కలవి, తెలుపు-నలుపుల మిశ్రవర్ణము కలవి, చిత్రవర్ణము కలవి అగు సహజసిద్ధమైన ధాతువులతో హనుమ నిలచిన మహేంద్రగిరి అలంకృతమై యుండెను. 5

అచ్చట కోరిన రూపు దాల్చగలవారు, అలంకారములు ధరించినవా రగు యక్షులు, కిన్నరులు, గంధర్వు లను దేవతలును, దేవతలతో సమానులగు పన్నగులును ఎక్కువగా విహరించుచుండిరి. 6

ఎల్లెడల శ్రేష్ఠములగు ఏనుగులు సంచరించు ఆ మహేంద్రపర్వతపు సుందరప్రదేశముపై నిలిచిన హనుమంతుడు మడుగులోని యేనుగువలె మిక్కిలి ప్రకాశించెను. 7

ఆయన తనకు విద్యాగురువగు సూర్యునకు, దేవరాజగు మహేంద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మకు, తదితరదేవతావిశేషములకును ప్రణమిల్లి అటనుండి బయలుదేరవలెనని సంకల్పించెను. 8

అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా పవనా యాత్మయోనయే,
తతోఽ భివవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశమ్. 9

ప్లవంగప్రవరై ర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః,
వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు. 10

నిష్ప్రమాణశరీర స్సన్ లిలంఘయిషు రర్ణవమ్,
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్. 11

స చచా లాచల శ్చాపి ముహూర్తం కపిపీడితః,
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయత్. 12

తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగంధినా,
సర్వత స్సంవృత శ్శైలో బభౌ పుష్పమయో యథా. 13

---

ఆయన తూర్పుదిశకు తిరిగి, తన తండ్రియగు వాయుదేవునకు మఱొక్క మాఱు నమస్కరించి, పిమ్మట సమర్థుడగుటచే దక్షిణదిశగా పోవుటకై తన శరీరమును పెంచెను. 9

హనుమంతు డట్లు ఎగురుటకు నిశ్చయించి, రాముని అభ్యుదయమును కోరుచు, కపిశ్రేష్ఠులు చూచుచుండగనే పున్నమి మున్నగు పర్వములందు ఉప్పొంగు సముద్రము వలె పెరిగెను. 10

అతడు సముద్రమును దాటగోరుచు, తన దేహమును కొలువరానంతగా పెంచి, భుజములచే, పాదములచే ఆ పర్వతమును గట్టిగా అణచెను. 11

ఆ మహేంద్రపర్వతము అచలము (కదలనిది) అయినను, హనుమంతుడు మర్దింపగా ఒక్క క్షణము చలించెను. ఆ కదలికకు కొండపై నున్న చెట్ల కొమ్మల కొనలందు విరబూసిన పూవు లన్నియు రాలిపడెను. 12

ఆ చెట్లు సుగంధము కల పుష్పరాశులను రాల్చి శిలాతలమును అన్నివైపుల కప్పివేయగా ఆ కొండ పూలకొండవలె ప్రకాశించెను. 13

తేన చోత్తమవీర్యేణ పీడ్యమాన స్స పర్వతః,
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః. 14

పీడ్యమానస్తు బలినా మహేంద్ర స్తేన పర్వతః,
రీతీ ర్నిర్వర్తయామాస కాంచనాంజనరాజతీః. 15

ముమోచ చ శిలా శ్శైలో విశాలా స్సమనశ్శిలాః,
మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీ రివానలః. 16

గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః,
గుహావిష్టాని భూతాని వినేదు ర్వికృతైః స్వరైః. 17

స మహాసత్త్వసన్నాద శ్శైలపీడానిమిత్తజః,
పృథివీం పూరయామాస దిశ శ్చోపవనాని చ. 18

శిరోభిః పృథుభి స్సర్పా వ్యక్తస్వస్తికలక్షణైః,

---

మెచ్చదగు పరాక్రమము గల హనుమంతుడు మర్దించగా ఆ మహేంద్రపర్వతము మదించిన యేనుగు మదజలము కార్చినట్లు, మిక్కుటముగా జలము కార్చెను. 14

బలశాలియగు హనుమంతు డట్లు పీడింపగా, ఆ పర్వతమునందలి బంగారు, నీలము, వెండి ఖనిజపు రాళ్ళు బ్రద్దలై ఆ యా లోహముల రేఖ లగపడెను. 15

మండుచున్న అగ్ని తన (ఏడు జ్వాలలలో నాల్గవదగు ధూమ్రవర్ణ యను) నడిమి జ్వాలతో కూడి పొగలు గ్రక్కిన ట్లా మహేంద్రపర్వతము మణిశిలలతో గూడిన పెనురాళ్లను విరజిమ్మెను. 16

హనుమంతు డట్లు మహేంద్రపర్వతమును మర్దించుచుండగా దిగులుపడి, అంతటను గుహలలో దాగిన జంతువులు దీనస్వరముతో బిగ్గరగా అఱచెను. 17

మారుతి అట్లా కొండను మర్దించుటచే అందు నివసించిన పెద్ద పెద్ద జీవులు చేసిన ఆక్రందనధ్వని భూమిని, దిక్కులను, వనములను దద్దరిల్లజేసెను. 18

అట్టి మర్దనముచే తమ విపులములగు పడగలపై అర్ధచంద్రాకారపు (నల్లని)

వమంతః పావకం ఘోరం దదంశు ర్దశనై శ్శిలాః. 19

తా స్తదా సవిషై ర్దష్టాః కుపితై స్తై ర్మహాశిలాః,

జజ్వలుః పావకోద్దీప్తా బిభిదుశ్చ సహస్రధా. 20

యాని చౌషధజాలాని తస్మిన్ జాతాని పర్వతే,

విషఘ్నా న్యపి నాగానాం న శేకు శ్శమితుం విషమ్. 21

భిద్యతేఽయం గిరి[1] ర్భూతై రితి మత్వా తపస్వినః.

త్రస్తా విద్యాధరా స్తస్మా దుత్పేతుః స్త్రీగణై స్సహ. 22

పానభూమిగతం హిత్వా హైమ మాసవభాజనమ్,

పాత్రాణి చ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్. 23

లేహ్యా నుచ్చావచాన్ భక్ష్యాన్ మాంసాని వివిధాని చ,

---

చిహ్నములు స్పష్టముగ అగపడగా, నోటినుండి భయంకరమగు అగ్ని వంటి విషము క్రక్కుచు సర్పములు కోరలతో రాళ్లను కఱచినవి. 19

కోపించిన విషసర్పములు ఆ పెనురాళ్లను కఱవగా అవి విషాగ్నిచే ప్రజ్వలించి, వేలకొలదిగా ముక్కలయ్యెను. 20

ఆ కొండపై మొలచిన ఓషధు లేవియును, విషము హరింపగలవైనను, ఆ సర్పముల విషమును పోగొట్టలేకపోయెను. 21

ఈ కొండను భూతము లేవో బ్రద్దలు చేయుచున్నవని తలచి తపస్వు లచటనుండి ఆకసమున కెగసిరి. 22

తమ స్త్రీలతో కలిసి మద్యము త్రాగుచు, మధురభక్ష్యములు తినుచున్న విద్యాధరులు పానభూమిపై గల బంగారు సారాయిగిన్నెను, విలువైన భోజన పాత్రలను, బంగారు కమండలములను, నాకదగిన పూదేనె మున్నగువానిని, ఆస్వాదింపదగిన వివిధ

---

1 భూతములు = బ్రహ్మరక్షస్సులు మున్నగు మహాభూతములు – తిలకవ్యాఖ్య. భూతాః భువి = పృథివ్యామ్, ఉతాః = వ్యాప్తాః. భూమిపై వ్యాపించిన దేవతావిశేషములు– రామాయణశిరోమణివ్యాఖ్య.

అర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్. 24
కృతకంఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః,
రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే. 25
హారనూపురకేయూర పారిహార్యధరాః స్త్రియః,
విస్మితా స్సస్మితా స్తస్థు రాకాశే రమణైః సహ. 26
దర్శయంతో మహావిద్యాం విద్యాధరమహర్షయః,
సహితా స్తస్థు రాకాశే వీక్షాంచక్రుశ్చ పర్వతమ్. 27
శుశ్రువుశ్చ తదా శబ్ద మృషీణాం భావితాత్మనామ్,
చారణానాం చ సిద్ధానాం స్థితానాం విమలేఽంబరే. 28
ఏష పర్వతసంకాశో హనుమాన్ మారుతాత్మజః,

---

భక్ష్యములను, పలురకముల మాంసములను, ఎద్దుతోలుతో చేయబడిన డాళ్లు, బంగారు పిడుల కత్తులను విడచి, తమ స్త్రీలతోగూడి భీతితో ఆకసమున కెగసిరి. 23-24

మెడలలో పుష్పమాలలు దాల్చి, మత్తులై, ఎఱ్ఱనైన మాలలు శిరమున ధరించి, ఎఱ్ఱచందనము దేహముపై పూసుకొని, సహజముగ పద్మములవంటివైనను మద్యపానముచే ఎఱ్ఱబారిన కన్నులు గల విద్యాధరు లాకాశమున కెగిరిపోయిరి. 25

ముత్యాలసరులు, అందెలు, భుజకీర్తులు, కంకణములు ధరించి రాజిల్లు విద్యాధరాంగనలు ఆ పర్వత మట్లు కదలుట కాశ్చర్యపడి, తమ రమణులను కూడి చిరునగవు లొలికించుచు ఆకసమున నిలచిరి. 26

మహర్షుల వంటి విద్యాధరశ్రేష్ఠులు అణిమాది అష్టసిద్ధిరూపమగు తమ మహావిద్యను ప్రయోగించి ఆకసమున నొక్కచోట నిలచి ఆ పర్వతము నవలోకించిరి. 27

వా రపుడు నిర్మలాకాశమున నిలచిన పరమాత్మనిష్ఠులగు మునులు, చారణులు, సిద్ధులు పలికిన ఈ వాక్యములు వినిరి. 28

"పర్వతమువలె పెద్ద శరీరముతో విలసిల్లు వాయుపుత్రుడగు ఈ హనుమంతుడు

తితీర్షతి మహావేగ స్సముద్రం మకరాలయమ్. 29
రామార్థం వానరార్థం చ చికీర్షన్ కర్మ దుష్కరమ్,
సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి. 30
ఇతి విద్యాధరాః శ్రుత్వా వచ స్తేషాం మహాత్మనామ్,
త మప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్. 31
దుధువే చ స రోమాణి చకంపే చాచలోపమః,
ననాద సుమహానాదం సుమహానివ తోయదః. 32
ఆనుపూర్వ్యేణ వృత్తం చ లాంగూలం రోమభి శ్చితమ్,
ఉత్పతిష్యన్ విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్. 33
తస్య లాంగూల మావిద్ధ మాత్తవేగస్య పృష్ఠతః,
దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః. 34

---

మహావేగముతో మొసళ్ళకు నెలవగు సముద్రమును దాటగోరుచున్నాడు. 29

రామునికొరకు, రామకార్యసాధనోద్యుక్తులగు వానరులకొఱకును కష్టసాధ్యమగు కార్యము సాధింపగోరుచు, ఇతరులకు దాటశక్యముగాని సముద్రపు టవ్వలియొడ్డు నితడు చేరగోరుచున్నాడు". 30

విద్యాధరు లా మహాత్ములగు ఋషులు మున్నగువారి పై వాక్యములు విని అట్లు అంతులేని పెనురూపు దాల్చి కొండపై నున్న కపిశ్రేష్ఠుడగు హనుమంతుని చూచిరి. 31

పర్వతమువంటి పెద్దదైన హనుమంతుడు తన మేని వెంట్రుకలను ఉత్సాహముతో విదల్చెను. శరీరమును కంపింపజేసెను. పెనుమబ్బు వలె గర్జించెను. 32

అతడు ఆకాశమున ఎగురబోవుచు గుండ్రముగా వెంట్రుకలతో చుట్టచుట్టుకొని పైన లావుగా నుండి క్రమముగా సన్నబడిన తన తోకను గరుత్మంతుడు సర్పమును విదిలించునట్లు విదిల్చెను. 33

వేగము పెంచిన హనుమంతుని వెన్నంటియున్న తోక గరుత్మంతుడు పట్టి తీసికొనిపోవుచున్న మహాసర్పమువలె నుండెను. 34

బాహూ సంస్తంభయామాస మహాపరిఘసన్నిభౌ,
ససాద చ కపిః కట్యాం చరణౌ సంచుకోచ చ. 35

సంహృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవ చ శిరోధరామ్,
[1]తేజః సత్త్వం తథా వీర్య మావివేశ స వీర్యవాన్. 36

మార్గ మాలోకయన్ దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః,
రురోధ హృదయే ప్రాణా నాకాశ మవలోకయన్. 37

పద్భ్యాం దృఢ మవస్థానం కృత్వా స కపికుంజరః,
నికుంచ్య కర్ణౌ హనుమా నుత్పతిష్యన్ మహాబలః,
వానరాన్ వానరశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్. 38

యథా రాఘవనిర్ముక్తః శరః శ్వసనవిక్రమః,
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితామ్. 39

---

ఆ హనుమంతుడు గొప్ప యినుపగుదియల వలె నున్న తన భుజములను కొండపై గట్టిగా నొక్కిపట్టి, నడుము సన్నము చేసికొని, కాళ్ళను కుంచింపజేసికొనెను. 35

శ్రీమంతుడు, మహాబలుడగు హనుమంతుడు తన బాహువులను, మెడను సంకోచింపజేసి, తనలో సహజముగనే గూఢముగ నున్న తేజస్సును, సత్త్వమును, వీర్యమును పైకి తెచ్చుకొనెను. 36

అతడు తన చూపును పైకి ప్రసరింపజేసి దూరమునుండియే తాను పోవలసిన మార్గము నాలోకించుచు, హృదయముననే ఉచ్ఛ్వాసనిశ్వాసములను బిగబట్టెను. 37

మహాబలుడు, కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు పాదములతో కొండ నదిమిపెట్టి, చెవులు ముడుచుకొని, ఎగురబోవుచు వానరులతో ఇట్లనెను. 38

రాముడు విడచిన బాణ మెట్లు వాయువేగముతో పోవునో, అట్లే నేనును రావణుడు పాలించు లంకాపురి కేగెదను. 39

---

[1]తేజస్సు = శత్రువులను ఎదుర్కొను శక్తి, సత్త్వము=బలము, వీర్యము= ఆకాశాదులలో సంచరించగల సామర్థ్యము – రామానుజీయవ్యాఖ్య.

న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్,
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్. 40
యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యా మ్యకృతశ్రమః,
బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్. 41
సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా,
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణామ్. 42
ఏవ ముక్త్వా తు హనుమాన్ వానరాన్ వానరోత్తమః,
ఉత్పపా తాథ వేగేన వేగవా నవిచారయన్. 43
సుపర్ణ మివ చాత్మానం మేనే స కపికుంజరః. 44
సముత్పతతి తస్మిం స్తు వేగా త్తే నగరోహిణః,
సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతు స్సమంతతః. 45
స మత్తకోయష్టిభకాన్ పాదపాన్ పుష్పశాలినః,

---

సీతాదేవి లంకలో కనబడనిచో, ఇదే వేగముతో దేవలోకమున కేగెదను. 40

స్వర్గముననుసీత కనబడదేని, ఎంతమాత్రము శ్రమచెందక, రాక్షసరాజగు రావణుని బంధించి తెచ్చెదను. 41

సర్వవిధములుగను కార్యము సాధించియే నేను సీతతో తిరిగి వత్తును. అట్లు కాదేని రావణునితో గూడ లంకనే పెకలించి యిటకు తెచ్చెదను. 42

అని వానరశ్రేష్ఠుడు, వేగవంతుడగు హనుమంతుడు వానరులతో పలికి, దూర మని కాని, సముద్ర మని కాని ఆలోచింపక, వేగముగ ఎగిరెను. అట్లెగురుచు తన్ను తాను గరుత్మంతునికి సాటిగా భావించెను. 43,44

హనుమంతుడు అట్లు ఎగురుచుండగా ఆ కొండపై నున్న చెట్లు అతని వేగమువలన తమ కొమ్మలను ముడుచుకొని అన్ని వైపులనుండియు పై కెగసినవి. 45

అతడు మదించిన కొంగలతో, విరబూసిన పూలతో ఒప్పారు చెట్లను తన తొడల

ఉద్వహ న్నూరువేగేన జగామ విమలేఽంబరే. 46

ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపి మన్వయుః,
ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధు మివ బాంధవాః. 47

త మూరువేగోన్మథితా స్సాలా శ్చాన్యే నగోత్తమాః,
అనుజగ్ము ర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్. 48

సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః,
హనుమాన్ పర్వతాకారో బభూ వాద్భుతదర్శనః. 49

సారవంతోఽథ యే వృక్షా న్యమజ్జన్ లవణాంభసి,
భయా దివ మహేంద్రస్య పర్వతా వరుణాలయే. 50

స నానాకుసుమైః కీర్ణః కపి స్సాంకురకోరకైః,
శుశుభే మేఘసంకాశః ఖద్యోతై రివ పర్వతః. 51

విముక్తా స్తస్య వేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః,

---

వేగముచే పెకలించి తనతో పైకెగురజేయుచు నిర్మలాకాశమున పయనించెను. 46

అ ట్లతని తొడలవేగముచే పై కెగసిన చెట్లు, దూరప్రయాణము చేయుటకు బయలుదేరిన తమ బంధువును సాగనంప వచ్చిన చుట్టములవలె క్షణకాలము హనుమ ననుసరించెను. అట్టిమద్ది చెట్లు, తక్కిన శ్రేష్ఠవృక్షములును, రాజు వెంట పోవు సైన్యములు వలె హనుమంతుని అనుసరించినవి. 47, 48

కొనవరకు విరియబూసిన అనేకవృక్షములు చుట్టును కుదురుకొని యుండగా, వాని నడుమ హనుమంతుడు, మహాపర్వతమువలె ఆశ్చర్యము గొలుపుచు కానవచ్చెను.

అట్లు పై కెగసిన చెట్లలో చేవకలిగి బరువైన చెట్లు హనుమంతు ననుసరింపజాలక దేవేంద్రునివలన భయపడిన పర్వతములవలె సముద్రమున పడి మునిగినవి. 50

ఆకాశమున మేఘమువలె నున్న హనుమంతుని శరీరముపై వివిధపుష్పములు, చిగురుటాకులు, మొగ్గలు పడుటచే అతడు మిణుగురులచే కొండవలె ప్రకాశించెను. 51

అవశీర్యంత సలిలే నివృత్తాః సుహృదో యథా. 52
లఘుత్వే నోపపన్నం తద్ విచిత్రం సాగరేఽపతత్,
ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయుసమీరితమ్. 53
తారాచిత మివాకాశం ప్రబభౌ స మహార్ణవః. 54
పుష్పౌఘే ణానుబద్ధేన నానావర్ణేన వానరః,
బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణవిభూషితః. 55
తస్య వేగసమాధూతైః పుష్పై స్తోయ మదృశ్యత,
తారాభి రభిరామాభి రుదితాభి రివాంబరమ్. 56
తస్యాంబరగతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ,
పర్వతాగ్రా ద్వినిష్క్రాంతౌ పంచాస్యావివ పన్నగౌ. 57

---

ఆ వృక్షములు హనుమంతుని కొంతదూరము వెంబడించి, అతని వేగము క్రమముగా వృద్ధినొందుటచే విడివడి, అతనిపై పుష్పములు కురిపించి, ప్రియమిత్రుని నీటిపట్టువఱకు పంపి మఱలివచ్చిన తక్కిన మిత్రులవలె నీట మునిగెను. 52

హనుమంతుని శరీరవేగముచే పై కెగసిన ఆ చెట్లపూలు, మిక్కిలి తేలికగా నున్న వగుటచే నీటిలో పడి మునగకుండెను. అవి నీటిపై తేలియాడుచు విచిత్రమగు శోభ కలిగియుండెను. అట్లు పుష్పములతో కూడిన మహాసముద్రము వందలకొలది నక్షత్రములతో కూడిన ఆకాశమువలె ప్రకాశించెను. 53,54

అనేకవర్ణములు గల పుష్పములు మేనిపై పడగా, వానితో హనుమ ఆకాశమున మెఱుపుతీగల సమూహముతో విలసిల్లు మేఘము వలె ప్రకాశించెను. 55

హనుమంతుని గమనవేగముచే నింగి కెగసిన పుష్పములు సముద్రమున పడగా, వానిచే ఆ సముద్రము ఉదయించిన సుందరనక్షత్రములచే ఆకాశమువలె కనుపించెను.

ఆకాశమున చేతులు చాచి హనుమ ఎగురుచుండగా అతని రెండు చేతులు, పర్వతశిఖరమునుండి వెలువడిన రెండు ఐదుతలల పాములవలె నుండెను. 57

పిబ న్నివ బభౌ చాపి సోర్మిమాలం మహార్ణవమ్,
పిపాసు రివ చాకాశం దదృశే స మహాకపిః. 58

తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః,
నయనే విప్రకాశేతే పర్వతస్థా వివానలౌ. 59

పింగే పింగాక్షముఖ్యస్య బృహతీ పరిమండలే,
చక్షుషీ సంప్రకాశేతే చంద్రసూర్యా వివోదితౌ. 60

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ,
సంధ్యయా సమభిస్పృష్టం యథా తత్ సూర్యమండలమ్. 61

లాంగూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే,
అంబరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః. 62

---

కపివరు డగు హనుమంతుడు సముద్రజలమునకు చేరువగా పోవునపుడు తరంగపంక్తులతో గూడ సముద్రజలమును త్రాగివేయుచున్నట్లును, పైపైకి దూరముగా సంచరించినపు డాకాశమును కబళింపగోరుచున్నట్లును అగపడెను. 58

హనుమంతు డట్లు వాయుమార్గమున పయనించుచుండగా మెరుపుల వలె వెలుగు అతని కన్నులు, పర్వతమందలి రెండగ్నులవలె ప్రకాశించెను. 59

వానరశ్రేష్ఠుడగు హనుమంతుని వృత్తాకారములైన పెద్ద పెద్ద కన్నులు పింగళవర్ణము కలవై, ఉదయించిన చంద్రసూర్యులవలె ప్రకాశించుచుండెను. 60

ఎఱ్ఱని ముక్కుచే ఎఱ్ఱబారిన హనుమంతుని ముఖము, సంధ్యారాగముతో కూడిన సూర్యమండలమువలె ప్రకాశించెను. 61

హనుమంతు డాకసమున ఎగురుచు తోకను పైకెత్తగా, అది యెత్తైన ఇంద్రధ్వజము (ఇంద్రుని ప్రీతికై చేయు ఉత్సవాదులలో ఉత్సవసూచకముగా ఎగురవేయు జెండా) వలె శోభిల్లెను. 62

లాంగూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రోఽనిలాత్మజః,
వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః. 63
స్ఫిగ్దేశే నాతితామ్రేణ రరాజ స మహాకపిః,
మహతా దారితేనేవ గిరిర్ గైరికధాతునా. 64
తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్,
కక్షాంతరగతో వాయు ర్జీమూత ఇవ గర్జతి. 65
ఖే యథా నిపతం త్యుల్కా హ్యుత్తరాంతా ద్వినిస్సృతా,
దృశ్యతే సానుబంధా చ తథా స కపికుంజరః. 66
పతత్పతంగసంకాశో వ్యాయత శ్శుశుభే కపిః,
ప్రవృద్ధ ఇవ మాతంగః కక్ష్యయా బధ్యమానయా. 67
ఉపరిష్టా చ్ఛరీరేణ చ్ఛాయయా చావగాఢయా,

---

తెల్లని కోఱలు కలవాడు, మహాబుద్ధిశాలి యగు హనుమంతుడు, తన చుట్టును చక్రాకారముగ నున్న తోకచే పరిధి (గూడు)తో కూడిన సూర్యుని వలె భాసిల్లెను. 63

మిక్కిలి యెఱ్ఱనైన వాలమూలప్రదేశము (తోక ప్రారంభమగు చోటు)తో కూడిన హనుమ చీల్చబడిన పెద్దగైరికధాతువుతో కూడిన కొండవలె శోభిల్లెను. 64

అట్లు పైనుండి సముద్రము దాటుచున్న వానరశ్రేష్ఠుడగు హనుమంతుని బాహుమూల (చంక) ప్రదేశమునుండి వెడలిన వాయువు మేఘమువలె గర్జింపసాగెను.

ఆకాశమున ఉత్తరదిక్కునుండి బయలుదేరిన ఉల్క, తోకతో కూడి ఎడతెగక యెట్లగపడునో అట్లే ఆ కపిశ్రేష్ఠుడును అగపడెను. 66

ఆకాశముపై పోవుచున్న సూర్యునివలె నున్న విశాలకాయుడగు హనుమంతుడు, స్తంభమునకు కట్టివేయుటచే నిడివిగా సాగుచున్న యేనుగువలె శోభిల్లెను. 67

అతడు సముద్రముపై అగపడు శరీరముతోను, క్రింద నీటిలో కానవచ్చు తన ప్రతిబింబముతోను, పైన తెరచాప మున్నగునవి కలిగి, క్రిందిభాగము నీటిలో నున్నదై

సాగరే మారుతావిష్టా నౌ రివాసీ త్తదా కపిః. 68

యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః,
స స తస్యోరువేగేన సోన్మాద ఇవ లక్ష్యతే. 69

సాగర స్యోర్మిజాలానా మురసా శైలవర్ష్మణామ్,
అభిఘ్నం స్తు మహావేగః పుప్లువే స మహాకపిః. 70

కపివాత శ్చ బలవాన్ మేఘవాత శ్చ నిస్సృతః,
సాగరం భీమనిర్ఘోషం కంపయామాసతుర్ భృశమ్. 71

వికర్ష న్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి,
పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ. 72

మేరుమందరసంకాశా నుద్ధతాన్ స మహార్ణవే,

---

గాలి వాలుచే పోవుచున్న ఓడవలె నుండెను. 68

మహాకపి యగు హనుమంతుడు సముద్రముపై ఏ యే ప్రదేశమున సంచరించెనో ఆ యా సముద్రభాగమున ఎత్తైన తరంగములు లేచుటచే, అది అపస్మారము కలది వలె (భ్రమణము, నురుగులతో నీరు కక్కుట, పెద్దగా ధ్వనిచేయుట మున్నగు లక్షణములతో) కనుపించెను. 69

మహావానరుడగు ఆ హనుమంతుడు పర్వతాకారముతో ఎగసిపడుచున్న అలలను తన రొమ్ముతో ఎదుర్కొనుచు, మహావేగముతో సముద్రము దాటెను. 70

మిక్కిలి బలముగల హనుమంతుని గమనవేగముచే వెడలిన వాయువు, మేఘముల వల్ల ఏర్పడిన గాలియును, భయంకరముగ గర్జించు సముద్రమును సైతము మిక్కిలి కలవరపఱచెను. 71

వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు తన వేగముతో సముద్రమునందలి అలలను లాగుచు, వానిని భూమ్యాకాశముల నడుమ వెదజల్లుచున్నట్లు ఆకాశమున ఎగిరెను. 72

మహావేగముగల హనుమంతుడు మేరు, మందర పర్వతముల వలె మహోన్నతము

అతిక్రామన్ మహావేగ స్తరంగాన్ గణయ న్నివ. 73

తస్య వేగసముద్ధూతం జలం సజలదం తదా,
అంబరస్థం విబభ్రాజ శారదాభ్ర మివాతతమ్. 74

తిమినక్రఝుషాః కూర్మా దృశ్యంతే వివృతా స్తదా,
వస్త్రాపకర్షణే నేవ శరీరాణి శరీరిణామ్. 75

ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః,
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే. 76

దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా,
ఛాయా వానరసింహస్య జలే చారుతరాఽభవత్. 77

శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్రానుగామినీ,
తస్య సా శుశుభే ఛాయా వితతా లవణాంభసి. 78

---

లైన సముద్రతరంగములను దాటిపోవుచు, వానిని లెక్కించుచు పోవుచుండెనో యన్నట్లుండెను. 73

హనుమంతుని వేగముచే పై కెగసిన నీరు, మేఘములతో కూడి తెల్లనై, ఆకాశమున వ్యాపించిన శరత్కాలమేఘమువలె కనుపించెను. 74

వస్త్రము తొలగింపగా మనుజుల అవయవము లగపడునట్లు, నీరు పై కెగయుటచే సముద్రమందలి పెనుచేపలు, మొసళ్ళు, పిల్లచేపలు, తాబేళ్ళు కనుపించెను. 75

అపుడు సముద్రమున నివసించు సర్పము లాకసమున మహావేగముతో ఎగురుచున్న హనుమంతుని చూచి గరుత్మంతుడని తలంచినవి. 76

ఆ కపిశ్రేష్ఠుని నీడ పదియోజనముల వెడల్పు, ముప్పది యోజనముల పొడవు కలిగి సముద్రపు నీటిలో మిక్కిలి సుందరముగ కనుపించెను. 77

హనుమ వెంట పోవుచున్న ఆ నీడ సముద్రమున వ్యాపించి తెల్లని మేఘముల దట్టమగు వరుసవలె ప్రకాశించెను. 78

శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః,
వాయుమార్గే నిరాలంబే పక్షవానివ పర్వతః. 79

యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపికుంజరః,
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః. 80

ఆపాతే పక్షిసంఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్,
హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా. 81

పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకాని చ,
కపినాఽఽకృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే. 82

ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః,
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమా ఇవ లక్ష్యతే. 83

ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవంగం త్వరితం తదా,

---

మహాతేజస్వి మహాశరీరధారి యగు హనుమంతుడు నిరాధారమగు ఆకాశమున రెక్కలుగల పర్వతమువలె ప్రకాశించెను. 79

బలవంతుడగు హనుమంతు డే మార్గమున వేగముగ పోవుచుండెనో ఆ మార్గమందంతటను అతని గమనవేగముచే జల మడుగంటగా అపు డచట సముద్ర మొక్కమారుగా పెద్ద దొన్నెవలె కనుపించెను. 80

హనుమంతుడు పక్షిసమూహము సంచరించు ఆకాశమార్గమున పోవుచు పక్షిరాజగు గరుత్మంతునివలెను, వాయువువలెను మేఘములను తన వేగముతో కొనిపోవుచు విలసిల్లెను. 81

అట్లు హనుమంతునిచే కొనిపోబడుచున్న మహామేఘము లొకింత పసుపు కలిసిన ఎరుపు, ఎరుపు, నలుపు, పసుపురంగు కలవై ప్రకాశించెను. 82

హనుమంతుడు మబ్బులలో మాటిమాటికి ప్రవేశించుచు, వెలువడుచు, కొంతతడవు మబ్బుల మాటున దాగి మఱల వెలువడుచుండు చంద్రునివలె కనుపించుచుండెను. 83

అట్లు వేగముగా సముద్రము దాటు హనుమంతుని చూచి, దేవతలు, గంధర్వులు,

వవర్షుః పుష్పవర్షాణి దేవగంధర్వదానవాః. 84
తతాప న హి తం సూర్యః ప్లవంతం వానరోత్తమమ్,
[1]సిషేవే చ తదా వాయూ రామకార్యార్థసిద్ధయే. 85
ఋషయ స్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసా,
జగుశ్చ దేవగంధర్వాః ప్రశంసంతో మహౌజసమ్. 86
నాగాశ్చ తుష్టువు ర్యక్షా రక్షాంసి విబుధాః ఖగాః,
ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్. 87
తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి,
ఇక్ష్వాకుకులమానార్థీ చింతయామాస సాగరః. 88
సాహాయ్యం వానరేంద్రస్య యది నాహం హనూమతః,
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్. 89

---

దానవులును పూలవానలు కురిపించిరి. 84

రామకార్యము సిద్ధింపవలెనని సముద్రముపై ఎగురుచున్న కపిశ్రేష్ఠుడగు హనుమంతునిపై సూర్యుడు తన వేడిమిని ప్రసరింపజేయలేదు. వాయువు కూడా చల్లగా వీచెను. 85

ఆకాశమార్గమున పోవుచున్న హనుమను ఋషులు స్తుతించిరి. దేవతలు, గంధర్వులును మహాతేజశ్శాలియగు ఆయనను ప్రశంసించుచు పాడిరి. 86

శ్రమనొందని హనుమంతుని అకస్మాత్తుగా చూచి నాగులు, యక్షులు, రక్షస్సులు (వీరు దిక్పాలకులగు రక్షస్సులకు సంబంధించినవారు) దేవతలు, పక్షులును పొగిడిరి. 87

కపిశ్రేష్ఠుడగు హనుమంతు డట్లు సముద్రము దాటుచుండగా ఇక్ష్వాకువంశప్రతిష్ఠ కోరు సాగరు డిట్లు తలంచెను. 88

వానరశ్రేష్ఠుడగు హనుమంతునకు నే నిపుడు తోడ్పడకున్నచో నోరుగల ప్రతివాడును నన్ను అన్ని విధములుగ నిందింపక మానడు. 89

---

1 రామకార్యప్రవృత్తుడగుటచే హనుమ తనయుడైనను వాయుదేవునకు సేవ్యుడే అయ్యెను – రామానుజీయము.

అహ మిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః,
ఇక్ష్వాకుసచివ శ్చాయం నావసీదితు మర్హతి. 90
తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః,
శేషం చ మయి విశ్రాంత స్సుఖే నాతిపతిష్యతి. 91
ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్ర శ్ఛన్న మంభసి,
హిరణ్యనాభం మైనాక మువాచ గిరిసత్తమమ్. 92
త్వ మిహాసురసంఘానాం పాతాళతలవాసినామ్,
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః. 93
త్వ మేషాం జాతవీర్యాణాం పునరే వోత్పతిష్యతామ్,
పాతాళ స్యాప్రమేయస్య ద్వార మావృత్య తిష్ఠసి. 94
తిర్య గూర్ధ్వ మధ శ్చైవ శక్తి స్తే శైల వర్ధితుమ్,

---

నేను ఇక్ష్వాకుప్రభువగు సగరునిచే సంవర్ధితుడ నైతిని. ఇత డిక్ష్వాకువంశజుడగు రాముని దూత. ఇతనికి కష్టము కలుగరాదు. 90

కావున ఈ హనుమంతుడు నడుమ విశ్రమించునట్లు చేయుట నాకు కర్తవ్యము. అట్లు నాకడ విశ్రమించి, తక్కిన మార్గము నవలీలగ హనుమ దాటగలడు. 91

సముద్రు డిట్లు ఉత్తమమగు ఆలోచన చేసి, తన జలములలో దాగియున్న బంగారు శిఖరములుగల పర్వతశ్రేష్ఠుడగు మైనాకుని చూచి యిట్లనెను. 92

ఓ పర్వతశ్రేష్ఠుడా! దేవేంద్రుడు పాతాళలోకమున నున్న రాక్షసులు భూమిపైకి రాకుండునట్లు ఇనుపగడియవలె నిన్నడ్డముగా నుంచినాడు. 93

బలము కూడగట్టుకొని, మఱల భూమిపైకి రాబోవు ఈ రాక్షసులను నివారించుచు నీవు విస్తృతమగు పాతాళలోకవు ద్వారమును కప్పివైచి నిలిచి యున్నావు. 94

ఓ పర్వతశ్రేష్ఠుడా! నీవు అడ్డముగను, పైకిని, క్రిందకును గూడ పెరుగగలవాడవు.

తస్మాత్ సంచోదయామి త్వా ముత్తిష్ఠ గిరిసత్తమ. 95
స ఏష కపిశార్దూల స్త్వా ముపర్యేతి వీర్యవాన్,
హనుమాన్ రామకార్యార్థం భీమకర్మా ఖ మాప్లుతః. 96
అస్య సాహ్యం మయా కార్య మిక్ష్వాకుకులవర్తినః,
మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమా స్తవ. 97
కురు సాచివ్య మస్మాకం న నః కార్య మతిక్రమేత్,
కర్తవ్య మకృతం కార్యం సతాం మన్యు ముదీరయేత్. 98
సలిలా దూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠ త్వేష కపి స్త్వయి,
అస్మాక మతిథి శ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః. 99
చామీకరమహానాభ దేవగంధర్వసేవిత,
హనుమాం స్త్వయి విశ్రాంత స్తత శ్శేషం గమిష్యతి. 100

---

కావున నిన్ను ప్రేరణ చేయుచున్నాను. నీ వింక లెమ్ము. 95

ఈ కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు ఎల్లరకు భయము గొల్పు గొప్పపనుల నిర్వహింపజాలినవాడు. పరాక్రమశాలి. సీతాన్వేషణ మను రామకార్యము సాధించుటక నీమీదుగా ఆకాశమార్గమున పోవుచున్నాడు. 96

ఇక్ష్వాకువంశ్యుడగు రాముని సేవించు ఈ హనుమంతునకు నేను సహాయము చేయవలయును. నాకు ఇక్ష్వాకువంశ్యులు పూజనీయులు. నీకు మిక్కిలి పూజనీయులు

కాకుత్స్థ స్యానృశంస్యం చ మైథిల్యాశ్చ వివాసనమ్,
శ్రమం చ ప్లవగేంద్రస్య సమీక్ష్యోత్థాతు మర్హసి. 101
హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణాంభసః,
ఉత్పపాత జలా త్తూర్ణం మహాద్రుమలతాయుతః. 102
స సాగరజలం భిత్త్వా బభూ వాభ్యుత్థిత స్తదా,
యథా జలధరం భిత్త్వా దీప్తరశ్మి ర్దివాకరః. 103
స మహాత్మా ముహూర్తేన సర్వత స్సలిలావృతః,
దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః. 104
శాతకుంభనిభైః శృంగై స్సకిన్నరమహోరగైః,
ఆదిత్యోదయసంకాశై రాలిఖద్భి రివాంబరమ్. 105
తప్తజాంబూనదైః శృంగైః పర్వతస్య సముత్థితైః,

---

రామచంద్రునికి సీతపై గల మిక్కిలి దయను, సీతాదేవి పరదేశనివాసమును, హనుమంతుని శ్రమమును ఆలోచించియైన నీ విక లెమ్ము. 101

బంగారు శిఖరములు గల మైనాకుడు సముద్రుని మాటలు విని పెద్దచెట్లు, తీగలతో కూడి శీఘ్రమే సముద్రజలమునుండి పైకి వచ్చెను. 102

ప్రకాశమానములగు కిరణములు గల సూర్యుడు మబ్బును చీల్చుకొని వెలువడినట్లు, మైనాకుడును సముద్రజలమును చీల్చుకొని అప్పుడే పైకి వచ్చెను. 103

సముద్రు డట్లు మహాత్ముడగు మైనాకుని ప్రేరింపగా అతడొక్క క్షణములో జలము ... శిఖరములను ప్రదర్శించెను. 104

ఆకాశం శస్త్రసంకాశ మభవత్ కాంచనప్రభమ్. 106

జాతరూపమయైః శృంగైర్ భ్రాజమానైః స్వయంప్రభైః,
ఆదిత్యశతసంకాశః సోఽభవ ద్గిరిసత్తమః. 107

త ముత్థిత మసంగేన హనుమా నగ్రతః స్థితమ్,
మధ్యే లవణతోయస్య విఘ్నోఽయ మితి నిశ్చితః 108

స త ముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః,
ఉరసా పాతయామాస జీమూతమివ మారుతః. 109

స తథా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః,
బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్ష చ ననంద చ. 110

త మాకాశగతం వీర మాకాశే సముపస్థితః,
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీత్ పర్వతః కపిమ్,

---

గల దయ్యెను. 106

అట్లు బంగారముతో నిండిన వగుటచే స్వప్రకాశముచేతనే వెలుగొందు శిఖరములు గల మైనాకపర్వతము నూఱ్ఱురు సూర్యులకు సాటిగా నుండెను. 107

ఆ విధముగ సముద్రము నుండి పైకి లేచి, తన యెదుట నిలచిన పర్వతమును చూచి హనుమంతుడు తన ప్రయాణము నడుమ కలిగిన విఘ్నముగా తలంచెను. 108

మానుషం ధారయన్ రూప మాత్మన శ్శిఖరే స్థితః. 111
దుష్కరం కృతవాన్ కర్మ త్వ మిదం వానరోత్తమ,
నిపత్య మమ శృంగేషు విశ్రమస్వ యథాసుఖమ్. 112
రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః,
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః. 113
కృతే చ ప్రతికర్తవ్య మేష ధర్మః సనాతనః,
సోఽయం త్వత్ప్రతికారార్థీ త్వత్త స్సమ్మాన మర్హతి. 114
త్వన్నిమిత్త మనేనాహం బహుమానాత్ ప్రచోదితః,
తిష్ఠ త్వం కపిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్. 115
యోజనానాం శతం చాపి కపి రేష సమాప్లుతః,
తవ సానుషు విశ్రాంతః శేషం ప్రక్రమతా మితి. 116

---

నతని కిట్లనెను. 111

'వానరోత్తమా! నీ వన్యుల కలవిగాని ఈ గొప్పపని (సముద్రలంఘన ప్రయత్నము) చేసితివి. కావున నా శిఖరములపై దిగి, సేద తీరువఱకు విశ్రమింపుము. 112

ఈ సాగరుడు రాముని పూర్వులచే పెంపొందింపబడినాడు. కావున రాముని హితము కోరి పోవుచున్న నిన్నాదరించుచున్నాడు. 113

తన కుపకరించిన వానికి ప్రత్యుపకారము చేయవలయును. ఇది సనాతనధర్మము. కావున నీ వాతిథ్యము స్వీకరింపవలెనని కోరుచున్న సముద్రుని కోర్కెను తీర్చి యతనిని సత్కరింపదగుదువు. 114

“ఓ మైనాకుడా! ఈ హనుమంతుడు నూరు యోజనముల దూరము ఎగుర
నీ సానువులం దొకింత విశ్రమించి తక్కిన దూరము

తదిదం గంధవత్ స్వాదు కందమూలఫలం బహు,
తదాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాంతోఽను గమిష్యసి. 117

అస్మాక మపి సంబంధః కపిముఖ్య త్వయాఽస్తి వై,
ప్రఖ్యాత స్త్రిషు లోకేషు మహాగుణపరిగ్రహః. 118

వేగవంతః ప్లవంతో యే ప్లవంగా మారుతాత్మజ,
తేషాం ముఖ్యతమం మన్యే త్వామహం కపికుంజర. 119

అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా,
ధర్మం జిజ్ఞాసమానేన కిం పున స్త్వాదృశో మహాన్. 120

త్వం హి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః,
పుత్ర స్తస్యైవ వేగేన సదృశః కపికుంజర. 121

పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః,

---

వానరశ్రేష్ఠుడవగు ఓ హనుమంతుడా! మంచి రుచి, వాసనగల ఈ కందమూలములను, పండ్లను తిని, కొంత తడవు విశ్రమించి, నీ వటుపై మఱల పోవచ్చును. 117

ఓ వానరముఖ్యుడా! మాకును, నీతో ముల్లోకములలో ప్రసిద్ధమగు ఇచ్చి పుచ్చుకొను సంబంధము లేకపోలేదు. ఇది సజ్జనసమ్మతమైన ఆతిథ్యరూపమగు ధర్మము. 118

వాయుతనయుడ వగు కపిశ్రేష్ఠుడా! మహావేగము, ఎగురుటలో కౌశలము గల వానరులలో నిన్ను ప్రధానునిగా తలంతును. 119

తస్మాత్త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్. 122
పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోऽభవన్,
తే హి జగ్ము ర్దిశ స్సర్వా గరుడానిలవేగినః. 123
తత స్తేషు ప్రయాతేషు దేవసంఘా స్సహర్షిభిః,
భూతాని చ భయం జగ్ము స్తేషాం పతనశంకయా. 124
తతః క్రుద్ధ స్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః,
పక్షాం శ్చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః. 125
స మా ముపగతః క్రుద్ధో వజ్ర ముద్యమ్య దేవరాట్,
తతోऽహం సహసా క్షిప్తః శ్వసనేన మహాత్మనా. 126
అస్మిన్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ,

---

కావున నీవు నాకు పూజనీయుడవు. నీ తండ్రి నాకు పూజనీయుడు. అందులకు కారణము చెప్పెదను వినుము. 122

నాయనా! పూర్వము కృతయుగమున పర్వతములకు ఱెక్కలుండెడివి. అందువలన అవి గరుత్మంతునివలె, వాయువువలె వేగముగ అన్ని దిక్కులకు పోవుచుండెడివి. 123

పర్వతము లట్లు ఎగురుచుండగా దేవతలు, ఋషులు, సకలజీవరాశులును ఆ పర్వతములు తమపై పడునేమో యను శంకతో భయపడినవి. 124

అంత నూఱుయాగముల నొనర్చి శతక్రతుడని ప్రసిద్ధుడైన దేవేంద్రుడు పర్వతములపై కోపించెను. తాను సహస్రాక్షుడు (వేయి కన్నులు కలవాడు) అగుటచే ఆయన వెదకి వెదకి ఎచట దొరికిన అచటనే ఆ పర్వతముల ఱెక్కలను వజ్రాయుధముతో

గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాభిరక్షితః. 127
తతోఽహం మానయామి త్వాం మాన్యో హి మమ మారుతః,
త్వయా మే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః. 128
అస్మి న్నేవంగతే కార్యే సాగరస్య మమైవ చ,
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వ మర్హసి మహాకపే. 129
శ్రమం మోక్షయ పూజాం చ గృహాణ కపిసత్తమ,
ప్రీతిం చ బహు మన్యస్వ ప్రీతోఽస్మి తవ దర్శనాత్. 130
ఏవముక్తః కపిశ్రేష్ఠ స్తం నగోత్తమ మబ్రవీత్.
ప్రీతోఽస్మి కృత మాతిథ్యం మన్యు రేషోఽపనీయతామ్. 131
త్వరతే కార్యకాలో మే అహశ్చా ప్యతివర్తతే,
ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్య మిహాంతరే. 132

---

నన్ను రక్షించిన కారణముచే నా ఱెక్కలు చెక్కు చెదరలేదు. 127

కావున నేను నిన్ను గౌరవించుచున్నాను. నాకు వాయుదేవుడు పూజనీయుడు. కపిశ్రేష్ఠుడా! మన నడుమ ఈ శ్రేష్ఠమగు సంబంధ మున్నదని గుర్తింపుము. 128

మహాత్ముడవగు ఓ వానరుడా! సాగరునకు, నాకును సంబంధించిన పూర్వవృత్తాంత మిట్లున్నది కనుక నీవు సంతోషముతో మా యభీష్టము నంగీకరింపదగుదువు. 129

ఇత్యుక్త్వా పాణినా శైల మాలభ్య హరిపుంగవః,
జగా మాకాశ మావిశ్య వీర్యవాన్ ప్రహసన్నివ. 133

స పర్వతసముద్రాభ్యాం బహుమానా దవేక్షితః,
పూజిత శ్చోపపన్నాభి రాశీర్భి రనిలాత్మజః. 134

అథోర్ధ్వం దూర ముత్పత్య హిత్వా శైలమహార్ణవౌ,
పితుః పంథాన మాస్థాయ జగామ విమలేఽంబరే. 135

భూయ శ్చోర్ధ్వగతిం ప్రాప్య గిరిం త మవలోకయన్,
వాయుసూను ర్నిరాలంబే జగామ విమలేఽంబరే. 136

తద్ ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః. 137

---

ప్రతిజ్ఞ ననుసరించి నడుమ ఎచ్చటను నిలువరాదు.(రాముడు విడచిన బాణమువలె
వాయువేగముతో రావణుడు పాలించు లంకకు పోయెదనని హనుమంతుని ప్రతిజ్ఞ)

అని పలికి పరాక్రమశాలియగు హనుమంతుడు మందహాసము చేయుచు తన
హస్తముతో మైనాకుని తాకి, ఆకాశమున కెగసి పోయెను. 133

మైనాకుడు, సముద్రుడును వాయుపుత్రుడగు ఆ హనుమంతుని మిక్కిలి ఆదరముతో
చూచిరి. 'నీ[illegible]ముని కార్యము సఫలము కావలె'నని కార్యసిద్ధికి తగినట్లు
ఆశీస్సులతో [illegible]చిరి. 13

[illegible]కృతి దాల్చిన మైనాక, సముద్రులను వీడ్కొని ఆ
[illegible]కి యె[illegible]ను చేరి నిర్మలాకాశమ[illegible]పయనించెను. 1
[illegible]

దేవతా శ్చాభవన్ హృష్టా స్తత్రస్థా స్తస్య కర్మణా,
కాంచనస్య సునాభస్య సహస్రాక్ష శ్చ వాసవః. 138
ఉవాచ వచనం ధీమాన్ పరితోషాత్ సగద్గదమ్,
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః. 139
హిరణ్యనాభ శైలేంద్ర పరితుష్టోఽస్మి తే భృశమ్,
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖమ్. 140
సాహ్యం కృతం తే సుమహ ద్విక్రాంతస్య హనూమతః,
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి. 141
రామ స్యైష హితాయైవ యాతి దాశరథే ర్హరిః,
సత్క్రియాం కుర్వతా తస్య తోషితోఽస్మి దృఢం త్వయా. 142

---

స్వర్ణమయుములగు ఉత్తమశిఖరములు కల మైనాకపర్వతము చేసిన హనుమత్సాహాయ్యరూప మగు పనిని చూచి దేవతలందఱును ఆనందించిరి. వేయి కన్నులతో దానిని చూచిన దేవేంద్రుడును ప్రీతుడయ్యెను. 138

ప్రశస్తమైన బుద్ధిగల దేవేంద్రుడు, సంతోషము కారణముగా డగ్గుత్తికతో కూడిన కంఠస్వరము కలవాడై శ్రేష్ఠములగు శిఖరములు గల ఆ మైనాకునితో స్వయముగా ఇట్లు పలికెను. 139



"సౌమ్యుడవు, బంగార... కలవాడవగు ఓ పర్వతశ్రేష్ఠుడా! నీ యెడల

తతః ప్రహర్ష మగమ ద్విపులం పర్వతోత్తమః,
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్. 143

స వై దత్తవర శ్శైలో బభూ వావస్థిత స్తదా,
హనుమాంశ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్. 144

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
అబ్రువన్ సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్. 145

అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి,
హనుమా న్నామ తస్య త్వం ముహూర్తం విఘ్న మాచర. 146

రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్,
దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్. 147

బల మిచ్ఛామహే జ్ఞాతుం భూయ శ్చాస్య పరాక్రమమ్,

---

దేవరాజగు ఇంద్రు డట్లు సంతసించుట చూచి పర్వతశ్రేష్ఠుడగు మైనాకుడును మిక్కిలి యానందించెను. 143

మైనాకు డట్లు దేవేంద్రునిచే నభయము పొంది, (హనుమంతుడు మఱలి వచ్చుటను ప్రతీక్షించుచు నీటిలో మునుగక) యట్లే నిలిచి యుండెను. హనుమంతుడును ముహూర్త కాలములో ఆ (సముద్ర) ప్రదేశమును గడచి ముందుకు పోయెను. 144

[illegible]తలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు సూర్యుని వలె ప్రకాశించు నాగ[illegible]రస యను నామె కిట్లనిరి. 145

త్వాం విజేష్య త్యుపాయేన విషాదం వా గమిష్యతి. 148
ఏవ ముక్తా తు సా దేవీ దైవతై రభిసత్కృతా,
సముద్రమధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః. 149
వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్,
ప్లవమానం హనూమంత మావృత్యేద మువాచ హ. 150
మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరై ర్వానరర్షభ,
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్. 151
ఏవ ముక్త స్సురసయా ప్రాంజలి ర్వానరర్షభః,
ప్రహృష్టవదనః శ్రీమా నిదం వచన మబ్రవీత్. 152
రామో దాశరథి ర్నామ ప్రవిష్టో దండకావనమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా. 153
అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః,

పరాక్రమమును తెలియగోరుచున్నాము. అతడు నిన్ను ఉపాయముతో జయించునో లేక భీతిల్లి విషాదము నొందునో చూచెదము. 148

అని దేవత లట్లు తన్ను కోరి సత్కరించగా ఆ సురసాదేవి సముద్రమధ్యమున అసహజము, వికృతము, ఎల్లరకు భయంకరము అగు రాక్షసరూపము దాల్చి ఎగురుచున్న హనుమంతుని మార్గమున కడ్డు నిలచి యిట్లనెను. 149,150

ఓ వానరశ్రేష్ఠుడా! దేవతలు నిన్ను నా కాహారముగా నిర్దేశించిరి. నే నిదే నిను

తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ. 154
తస్యా స్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్,
కర్తు మర్హసి రామస్య సాహ్యం విషయవాసిని. 155
అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్,
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే. 156
ఏవ ముక్తా హనుమతా సురసా కామరూపిణీ,
అబ్రవీ న్నాతివర్తే న్మాం కశ్చి దేష వరో మమ. 157

---

పొందిన రాముడు మాయామృగమును పట్టుటకై పోగా, అతని భార్య, యశస్విని యగు సీతను రావణు డపహరించినాడు. 154

నేను రామునాజ్ఞ తల దాల్చి దూతనై సీతాదేవి కడ కేగెదను. నీవు రాముని రాజ్యమం దున్నదానవు. కావున రామునకు సహాయము చేయదగుదువు. 155

అట్లు కాదేని, సీతాదేవిని చూచి, పిమ్మట అవలీలగా కార్యములు సాధించురాముని దర్శించి వచ్చి నీ నోట పడెదను. నా మాట నిజము. నీ కిదే ప్రతిజ్ఞచేయుచున్నాను. 156

అని యిట్లు హనుమ పలుకగా కామరూపిణియగు ఆ సురస "ఓయీ! నన్నతిక్రమించి యెవ్వడును పోజాలడు. నా కట్టి వరమున్న" దనెను. 157

---

157వ శ్లోకము తరువాత కొన్ని ప్రతులలో కనుపించు క్రింది శ్లోకములు ప్రక్షిప్తములు, అసంగతములును. నూరు యోజనములు హనుమ పెరుగుచో సముద్రము వెడల్పును అంతే కనుక ఇటు వానరులు, అటు రాక్షసులును హనుమంతుని తప్పక తెలిసికొని యుండెడివారు (గోవిందరాజీయము). ఆ శ్లోకము లివి.

తం ప్రయాంతం సముద్వీక్ష్య సురసా వాక్య మబ్రవీత్ ,

తద్దృష్ట్వా వ్యాదితం త్వాస్యం వాయుపుత్ర స్సుబుద్ధిమాన్,
సుసంక్షి ప్యాత్మనః కాయం బభూ వాంగుష్ఠమాత్రకః. 158

---

బుద్ధిమంతుడగు హనుమంతు డట్లు తెఱచిన యామె నోటిని చూచి, తన శరీరమును మిక్కిలి తగ్గించుకొని బొటనవ్రేలి పరిమాణము కలవాడయ్యెను. 158

---

ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజన మాయతః,
దశయోజనవిస్తారో బభూవ హనుమాం స్తదా. 4
తం దృష్ట్వా మేఘసంకాశం దశయోజన మాయతమ్,
చకార సురసా చాస్యం వింశద్యోజన మాయతమ్. 5
హనుమాంస్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజన మాయతః,
చకార సురసా వక్త్రం చత్వారింశ త్తథోచ్ఛ్రితమ్. 6
బభూవ హనుమాన్ వీరః పంచాశద్యోజనోచ్ఛ్రితః,
చకార సురసా వక్త్రం షష్టియోజన మాయతమ్. 7
తథైవ హనుమా న్వీరః సప్తతీయోజనోచ్ఛ్రితః,
చకార సురసా వక్త్ర మశీతీయోజనాయతమ్. 8
హనుమా నచలప్రఖ్యో నవతీయోజనోచ్ఛ్రితః,
చకార సురసా వక్త్రం శతయోజన మాయతమ్. 9

వీని భావమిది: నాగమాత సురస, ఆకాశమున పోవుచున్న హనుమంతుని చూచి, అతని బలమెట్టిదో తెలిసికొన దలచి అతనితో 'ఓ వానరోత్తమా! నీవిపుడు నా నోట ప్రవేశించియే పోవలెను. నాకిది వెనుక బ్రహ్మ యిచ్చిన వరము" అని పలికి శీఘ్రమే తన విశాలమగు నోరు తెఱచి హనుమంతుని యెదుట నిలచెను. సురస మాటలు విని హనుమంతుడు కోపించి "నీవు నను మ్రింగగోరితివి గదా

సోఽభిపత్యాశు తద్వక్త్రం నిష్పత్య చ మహాజవః,
అంతరిక్షే స్థితః శ్రీమా నిదం వచన మబ్రవీత్. 159

ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తు తే,
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీ ద్వర స్తవ. 160

తం దృష్ట్వా వదనా న్ముక్తం చంద్రం రాహుముఖా దివ,
అబ్రవీత్ సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్. 161

అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్,
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా. 162

తత్ తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
సాధు సాధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్. 163

స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్,

---

మహావేగము గల హనుమంతుడు శీఘ్రమే యామె నోట ప్రవేశించి, బయటకు వచ్చి, ఆకాశమున నిలచి ఉత్సాహముతో ప్రకాశమానుడై యిట్లనెను. 159

'ఓ దాక్షాయణీ! నీ కిదే నమస్కారము. నేను నీ నోట ప్రవేశించి వెలువడుటచే బ్రహ్మవర మిపుడు సత్యమయ్యెను కదా. నే నిపుడు సీతమ్మ కడ కేగెదను. 160

అంతట సురస తన సహజరూపము దాల్చి, రాహువు నోటినుండి వెలికి వచ్చిన చంద్రునివలె తన నోటినుండి వెలువడిన హనుమంతునితో నిట్లనెను. 161

జగా మాకాశ మావిశ్య వేగేన గరుడోపమః. 164

సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే,

చరితే కైశికాచార్యై రైరావతనిషేవితే. 165

సింహకుంజరశార్దూల పతగోరగవాహనైః,

విమానై స్సంపతద్భిశ్చ విమలై స్సమలంకృతే. 166

వజ్రాశనిసమాఘాతైః పావకై రుపశోభితే,

కృతపుణ్యై ర్మహాభాగైః స్వర్గజిద్భి రలంకృతే. 167

వహతా హవ్య మత్యర్థం సేవితే చిత్రభానునా,

గ్రహనక్షత్రచంద్రార్క తారాగణవిభూషితే. 168

మహర్షిగణగంధర్వ నాగయక్షసమాకులే,

వివిక్తే విమలే విశ్వే విశ్వావసునిషేవితే. 169

---

ఎదిరింపరాని ఆ సముద్రముపై యెప్పటివలె వెడలిపోయెను. 164

అతడు, మేఘములు కురిపించు వర్షధారలతో కూడినది, పక్షులు సంచరించునది, కైశికరాగ మాలపించు విద్యాధరులు విహరించునది, ఇంద్రధనుస్సుతో కూడినది, (లేదా ఐరావతమను ఇంద్రుని ఏనుగు విహరించునది), సింహములు, ఏనుగులు, పులులు, పక్షులు, సర్పములు లాగుచుండగా వేగముగ పోవు సుందరవిమానములు కలది. వజ్రము, పిడుగులు ఢీకొనుట్లు అగ్నులు (తేజోవంతములగు నక్షత్రములు)

దేవరాజగజాక్రాంతే చంద్రసూర్యపథే శివే,
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే. 170
బహుశ స్సేవితే వీరై ర్విద్యాధరగణై ర్వరైః,
జగామ వాయుమార్గే తు గరుత్మానివ మారుతిః. 171
ప్రదృశ్యమాన స్సర్వత్ర హనుమాన్ మారుతాత్మజః,
భేజేఽంబరం నిరాలంబం లంబపక్ష ఇవాద్రిరాట్. 172
ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ,
మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ. 173
అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యహ మాశితా,
ఇదం హి మే మహత్ సత్త్వం చిరస్య వశ మాగతమ్. 174
ఇతి సంచింత్య మనసా ఛాయా మస్య సమాక్షిపత్,
ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః. 175

---

విస్తృతమై జీవుల కెల్లరికి పైభాగమున బ్రహ్మచే నిర్మితమైన చాందినీ అయినది, వీరులు, శ్రేష్ఠులగు విద్యాధరుల కాటపట్టయినది అగు వాయుమార్గమున గరుత్మంతునివలె పోయెను. 165-171

వాయునందనుడగు హనుమంతుడు పొడవైన రెక్కలు కల పర్వతరాజు వలె అన్నివైపులకును అగపడుచు నిరాధారమగు ఆకాశమున పయనించెను. 172

కోరిన రూపము పొందగల సింహిక యను రాక్షసి అట్లు సముద్రము దాటుచున్న హనుమంతుని చూచి సంతోషముతో నుప్పొంగి తన మదిలో నిట్లు తలంచెను. 173

"చాలకాలమునకు నేడు నాకు ఆహారము ...

సమాక్షిప్తోఽస్మి సహసా పంగూకృతపరాక్రమః,
ప్రతిలోమేన వాతేన మహానౌ రివ సాగరే. 176
తిర్య గూర్ధ్వ మధశ్చైవ వీక్షమాణ స్తతః కపిః,
దదర్శ స మహత్ సత్త్వ ముత్థితం లవణాంభసి. 177
తద్ దృష్ట్వా చింతయామాస మారుతి ర్వికృతాననమ్. 178
కపిరాజేన కథితం సత్త్వ మద్భుతదర్శనమ్,
ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః. 179
స తాం బుద్ధ్వాఽర్థతత్త్వేన సింహికాం మతిమాన్ కపిః,
వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః. 180
తస్య సా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః,
వక్త్రం ప్రసారయామాస పాతాళాంతరసన్నిభమ్,

---

"సముద్రమున ఎదురు గాలిచే పెద్ద ఓడవలె, వేగమంతయు కోల్పోతిని. ఒక్కమారుగా నన్నెవరో పట్టి (వెనుకకు) లాగివేయుచున్నారు." 176

పిమ్మట హనుమంతుడు ప్రక్కలకు, పైకి, క్రిందకు చూచుచు తుదకు సముద్రము నుండి పైకి లేచిన యొక పెద్ద జంతువును చూచెను. 177

వికృతమగు ముఖముగల దానిని చూచి హనుమంతు డిట్లు తలంచెను. 178

చూచుటకు ఆశ్చర్యము కలిగించుచు, మహాపరాక్రమము కలదై, ఏ జీవిచెను...

ఘనరాజీవ గర్జంతీ వానరం సమభిద్రవత్. 181

స దదర్శ తత స్తస్యా వివృతం సుమహ న్ముఖమ్,
కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః. 182

స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః,
సంక్షిప్య ముహు రాత్మానం నిష్పపాత మహాబలః. 183

ఆస్యే తస్యా నిమజ్జంతం దదృశు స్సిద్ధచారణాః,
గ్రస్యమానం యథా చంద్రం పూర్ణం పర్వణి రాహుణా. 184

తత స్తస్యా నఖై స్తీక్ష్ణై ర్మర్మా ణ్యుత్కృత్య వానరః,
ఉత్పపా తాథ వేగేన మనస్సంపాతవిక్రమః. 185

తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ,
స కపిప్రవరో వేగా ద్వవృధే పున రాత్మవాన్. 186

హృతహృత్ సా హనుమతా పపాత విధురాఽంభసి. 187

---

వెంబడించెను. అంతట మేధావి యగు హనుమంతుడు తన్ను కబళింపజాలునట్లు తెఱచిన ఆమె పెద్ద నోటిని, దేహపరిమాణమును, ప్రాణస్థానములను చూచెను 181,182

వజ్రము వలె కఠినమైన దేహము గల మహాబలుడగు హనుమంతుడు తన శరీరమును క్రమముగా తగ్గించుకొని, తెఱచుకొన్న యామె నోట ప్రవేశించెను. 183

అట్లామె నోటపడుచు పర్వసమయమున రాహువు మ్రింగు

తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్,
భూతా న్యాకాశచారీణి తమూచుః ప్లవగోత్తమమ్. 188

భీమ మద్య కృతం కర్మ మహత్ సత్త్వం త్వయా హతమ్,
సాధయార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాం వర. 189

యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ,
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స కర్మసు న సీదతి. 190

స త్వై స్సంభావితః పూజ్యః ప్రతిపన్నప్రయోజనః,
జగా మాకాశ మావిశ్య పన్నగాశనవత్ కపిః. 191

ప్రాప్తభూయిష్ఠపారస్తు సర్వతః ప్రతిలోకయన్,

---

ధైర్యముచేతను, సామర్థ్యముచేతను పడవైచి, మఱల వేగముగ పెరిగెను. అతడట్లు గుండెను చీల్చగా ఆ సింహిక మృతినొంది నీటబడెను. 186-187

అట్లు హనుమంతుడు చంపగా నీటబడిన సింహికను చూచి ఆకాశసంచారులగు భూతము లతని కిట్లనెను. 188

వానరశ్రేష్ఠుడా! నీ విపు డొక గొప్ప జంతు[illegible]

యోజనానాం శతస్యాంతే వనరాజిం దదర్శ సః. 192

దదర్శ చ పతన్నేవ వివిధద్రుమభూషితమ్,
ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనాని చ. 193

సాగరం సాగరానూపం సాగరానూపజాన్ ద్రుమాన్,
సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్. 194

స మహామేఘసంకాశం సమీక్ష్యాత్మాన మాత్మవాన్,
నిరుంధంత మివాకాశం చకార మతిమాన్ మతిమ్. 195

కాయవృద్ధిం ప్రవేగం చ మమ దృష్ట్వైవ రాక్షసాః,
మయి కౌతూహలం కుర్యు రితి మేనే మహాకపిః. 196

తత శ్శరీరం సంక్షిప్య తన్మహీధరసన్నిభమ్,
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్. 197

---

చూచెను. 192

అత డట్లాకాశమున పోవుచునే పలువిధములగు చెట్లతో గూడిన ద్వీపమును, మలయపర్వతముపై తోటలను, సముద్రమును, దాని తీరమందలి నీటిమడుగులను, వాని ప్రక్క మొలచిన చెట్లను, నదీముఖములను చూచుచు పోయెను. 193, 194

పిమ్మట మహామేఘసదృశమై ఆకాశము నడ్డగించుచున్నటులున్న తన పెద్ద [illegible] 195

తద్రూప మతిసంక్షిప్య హనుమాన్ ప్రకృతౌ స్థితః,
త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః. 198

స చారునానావిధరూపధారీ, పరం సమాసాద్య సముద్రతీరమ్,
పరై రశక్యః ప్రతిపన్నరూప, స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః. 199

తత స్స లంబస్య గిరే స్సమృద్ధే, విచిత్రకూటే నిపపాత కూటే,
సకేతకోద్దాలకనాలికేరే, మహాద్రికూటప్రతిమో మహాత్మా. 200

తతస్తు సంప్రాప్య సముద్రతీరం,
సమీక్ష్య లంకాం గిరివర్యమూర్ధ్ని,
కపిస్తు తస్మిన్నిపపాత పర్వతే,
విధూయ రూపం వ్యథయన్ మృగద్విజాన్. 201

---

హనుమంతుడు, మూడడుగులు మాత్రమే వేసి బలిచక్రవర్తి పరాక్రమగర్వము నణచి వామనుడు తన పూర్వరూపము దాల్చినట్లు తన రూపమును మిక్కిలి తగ్గించుకొని సహజరూపము దాల్చెను. 198

సుందరములగు వివిధరూపములు దాల్చగల హనుమంతు డట్లు అన్యుల కలవి కానివాడై సముద్రపు టవ్వలి యొడ్డున కేగి, తన పెనుశరీరమును చూచుకొని, తాను చేయవలసిన పని నూహించి, తన సహజరూపము దాల్చెను. 199

అంతట గొప్ప కొండశిఖరము వలె నున్న మహాత్ముడగు ఆ హనుమంతుడు, వివిధశిఖరములతో ఒప్పుచు, మొగలిపొదలు విరిగిచెట్లు కొబ్బరిచెట్లతో సుసంపన్నమై

స సాగరం దానవపన్నగాయుతం
బలేన విక్రమ్య మహోర్మిమాలినమ్,
నిపత్య తీరే చ మహోదధే స్తదా దదర్శ
లంకా మమరావతీ మివ. 202

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే ప్రథమః సర్గః.*

---

ఆ హనుమంతు డట్లు దానవులు, పన్నగులు కలదై, పెద్ద పెద్ద అలల వరుసలతో కూడిన సముద్రమును తన బలముతో దాటి, తీరము చేరి యచట అమరావతివలె నున్న లంకానగరమును చూచెను. 202

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమందు*
*సుందరకాండమున ప్రథమసర్గము.*

# 2. ద్వితీయః సర్గః

*(హనుమంతుడు సముద్రము దాటి లంకను చూచుట)*

స సాగర మనాధృష్య మతిక్రమ్య మహాబలః,
త్రికూటశిఖరే లంకాం స్థితాం స్వస్థో దదర్శ హ. 1
తతః పాదపముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్,
అభివృష్టః స్థిత స్తత్ర బభౌ పుష్పమయో యథా. 2
యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వాఽప్యుత్తమవిక్రమః,
అనిశ్వసన్ కపి స్తత్ర న గ్లాని మధిగచ్ఛతి. 3
శతా న్యహం యోజనానాం క్రమేయం సుబహూన్యపి,
కిం పున స్సాగర స్యాంతం సంఖ్యాతం శతయోజనమ్. 4
స తు వీర్యవతాం శ్రేష్ఠః ప్లవతామపి చోత్తమః,

---

మహాబలుడగు హనుమంతు డట్లు దాటరాని సముద్రమును దాటి, సేదతీరి, త్రికూటపర్వతశిఖరముపై నున్న లంకానగరమును చూచెను. 1

అపు డా పర్వతమందలి చెట్లు పూలవాన కురిపించెను. పరాక్రమశాలి యగు హనుమంతు డా పూలలో నిండి, పూలతో చేయబడిన కోతివలె నుండెను. 2

జగామ వేగవాన్ లంకాం లంఘయిత్వా మహోదధిమ్. 5

శాద్వలాని చ నీలాని గంధవంతి వనాని చ,
గండవంతి చ మధ్యేన జగామ నగవంతి చ. 6

శైలాంశ్చ తరుసంఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః,
అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః. 7

స తస్మి న్నచలే తిష్ఠన్ వనా న్యుపవనాని చ,
స నగాగ్రే చ తాం లంకాం దదర్శ పవనాత్మజః. 8

సరళాన్ కర్ణికారాంశ్చ ఖర్జూరాంశ్చ సుపుష్పితాన్,
ప్రియాళాన్ ముచుళిందాంశ్చ కుటజాన్ కేతకానపి. 9

ప్రియంగూన్ గంధపూర్ణాంశ్చ నీపాన్ సప్తచ్ఛదాం స్తథా,
అసనాన్ కోవిదారాంశ్చ కరవీరాంశ్చ పుష్పితాన్. 10

పుష్పభారనిబద్ధాంశ్చ తథా ముకులితా నపి,

---

హనుమంతుడు గొప్ప వేగముతో మహాసముద్రమును దాటి లంకను చేరెను. 5

వానరశ్రేష్ఠుడు, తేజశ్శాలియగు హనుమంతుడు నల్లని పచ్చికపట్టులను, మంచి వాసనలు గుబాళించు అడవులను, పెనురాలతో కూడి, నడుమ ప్రశస్తవృక్షములు కల వనములను దాటి, చెట్లతో నిండిన కొండలను, పూచిన వనసమూహములను గడచి

పాదపాన్ విహగాకీర్ణాన్ పవనాధూతమస్తకాన్. 11
హంసకారండవాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః,
ఆక్రీడాన్ వివిధాన్ రమ్యాన్ వివిధాంశ్చ జలాశయాన్. 12
సంతతాన్ వివిధైర్ వృక్షై స్సర్వర్తుఫలపుష్పితైః,
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుంజరః. 13
సమాసాద్య చ లక్ష్మీవాన్ లంకాం రావణపాలితామ్,
పరిఖాభి స్సపద్మాభి స్సోత్పలాభి రలంకృతామ్. 14
సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్,
సమంతా ద్విచరద్భిశ్చ రాక్షసై రుగ్రధన్విభిః. 15
కాంచనే నావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్,
గృహైశ్చ గ్రహసంకాశై శ్శారదాంబుదసన్నిభైః. 16
పాండురాభిః ప్రతోళీభి రుచ్చాభి రభిసంవృతామ్,

మొగ్గలు తొడిగినవి, పక్షులతో నిండినవి, గాలికి కదలాడు కొమ్మల కొనలు కలవి అగు చెట్లను, హంసలు కారండవము లను పక్షులు వ్యాపించియుండగా, తామరలతో కలువలతో కూడియున్న పెద్ద బావులను, పలువిధములగు జన సామాన్య యోగ్యములగు సుందర క్రీడాస్థానములను, సర్వర్తువులలో పండు పండ్లతో, పూలతో శోభిల్లు పలుచెట్లతో వ్యాపమైన రాజయోగ్య సుందరోద్యానములను, వివిధ

అట్టాలకశతాకీర్ణాం పతాకాధ్వజమాలినీమ్. 17

తోరణైః కాంచనై ర్దివ్యై ర్లతాపంక్తివిచిత్రితైః,

దదర్శ హనుమాన్ లంకాం దివి దేవపురీమివ. 18

గిరిమూర్ధ్ని స్థితాం లంకాం పాండురై ర్భవనై శ్శుభైః,

దదర్శ స కపిశ్రేష్ఠః పుర మాకాశగం యథా. 19

పాలితాం రాక్షసేంద్రేణ నిర్మితాం విశ్వకర్మణా,

ప్లవమానా మివాకాశే దదర్శ హనుమాన్ పురీమ్. 20

వప్రప్రాకారజఘనాం విపులాంబునవాంబరామ్,

శతఘ్నీశూలకేశాంతా మట్టాలకవతంసకామ్. 21

మనసేవ కృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా,

---

గ్రహములవలెను, శరత్కాలపు మేఘముల వలెను అచటి గృహములు ఉన్నతములు, ప్రకాశమానములై యుండెను. వీథులు గృహసంబంధముచే ఉన్నతములు, ధవళములై యుండెను. నూర్లకొలది కోటబురుజులతో, పతాకలతో, ధ్వజములతో ఆ నగరము వెలుగొందుచుండెను. బంగారు వికారములు, శ్రేష్ఠములు, తీగెల వంటి రేఖలు చిత్రింపబడిన ద్వారప్రదేశములతో కూడి స్వర్గమున అమరావతివలె నున్న యా నగరమును హనుమంతుడు చూచెను. 14-18

తెల్లని శుభకరములగు గృహములతో పర్వతశిఖరముపై ఆకాశమంటుచున్నట్లు విలసిల్లు లంకను హనుమ దర్శించెను. 19

... ఆ పట్టణము కొండకొనపై

ద్వార ముత్తర మాసాద్య చింతయామాస వానరః. 22
కైలాసశిఖరప్రఖ్యా మాలిఖంతీ మివాంబరమ్,
డీయమానా మివాకాశ ముచ్ఛ్రితై ర్భవనోత్తమైః. 23
సంపూర్ణాం రాక్షసైర్ఘోరై ర్నాగై ర్భోగవతీ మివ,
అచింత్యాం సుకృతాం స్పష్టాం కుబేరాధ్యుషితాం పురా. 24
దంష్ట్రిభి ర్బహుభి శ్శూరై శ్శూలపట్టిసపాణిభిః,
రక్షితాం రాక్షసై ర్ఘోరై ర్గుహా మాశీవిషైరివ. 25
తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః,
రావణం చ రిపుం ఘోరం చింతయామాస వానరః. 26
ఆగత్యాపీహ హరయో భవిష్యంతి నిరర్థకాః,
న హి యుద్ధేన వై లంకా శక్యా జేతుం సురైరపి. 27

విశ్వకర్మయే నిర్మించినను, వైభవమునుబట్టి ఎవ్వడో మహానుభావుడు సంకల్ప మాత్రముననే సృజించినట్టిది వలె నున్న లంకానగరపు ఉత్తరద్వారమునకు చేరిన హనుమ సీత నెట్లు వెదకుటయా యని ఆలోచింపసాగెను. 21,22

కైలాసపర్వతశిఖరమువలె మహోన్నతమై ఆకాశము నొఱయుచున్నదివలె నొప్పుచు, ఉన్నతములైన మహాభవనములచే ఆకాశమున కెగురుచున్నట్లు కనుపించుచు, సర్పము లతో పాతాళమువలె భీకరులైన రాక్షసులతో కూడి, ఊహింపరానిదై, చక్కని నిర్మాణము కలిగి, చూడ చక్కనై, పూర్వము కుబేరుని నివాసమై, సర్పములచే కాపాడబడు గుహవలె, కోఱలుగలిగి, శూలములు అడ్డకత్తులు చేత ధరించిన శూరులు, భయంకరులగు

ఇమాం తు విషమాం దుర్గాం లంకాం రావణపాలితామ్,
ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః. 28

అవకాశో న సాంత్వస్య రాక్షసే ష్వభిగమ్యతే,
న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే. 29

చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్,
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః. 30

యావ జ్జానామి వైదేహీం యది జీవతి వా న వా,
తత్రైవ చింతయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్. 31

తత స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః,
గిరిశృంగే స్థిత స్తస్మిన్ రామ స్యాభ్యుదయే రతః. 32

---

మిక్కిలి నిమ్నోన్నతమై, అన్యులకు చొరరాక రావణపాలితమగు ఈ లంకను చే
మహాభుజుడగు రాముడు (ఒకే బాణముతో సాలములను-గిరిని-పాతాళమును కొట్టి
వాడయినను) మాత్ర మేమి చేయగలడు? 28

రాక్షసులు ఆసురస్వభావులు. వారికడ సాంత్వము (బుజ్జగింపుమాట) చెల్లద
పోనీ దానమిత్తుమా యన్నను వారు మిగుల సంపన్నులుగాన ధనమునకు వశపడర
... లేదు. బుది. పరాక్రమము కలవారు గా

అనేన రూపేణ మయా న శక్యా రక్షసాం పురీ,
ప్రవేష్టుం రాక్షసై ర్గుప్తా క్రూరై ర్బలసమన్వితైః. 33
ఉగ్రౌజసో మహావీర్యా బలవంతశ్చ రాక్షసాః,
వంచనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా. 34
లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లంకాపురీ మయా,
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్. 35
తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః,
హనుమాం శ్చింతయామాస వినిశ్చిత్య ముహు ర్ముహుః. 36
కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్,
అదృష్టో రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా. 37

---

క్రూరులు, బలవంతులగు రాక్షసులు ఈ నగరమును కాపాడుచున్నారు. నే నీ రూపముతోనే ఇందు ప్రవేశింపదగదు. 33

ఈ రాక్షసులు ప్రచండమగు తేజముకలవారు. మహాబలపరాక్రమసంపన్నులు. నేను సీతాదేవిని వెదకునపుడు వీరిని వంచింపక తప్పదు. 34

నేను కనుపింతునా రాక్షసులు పట్టుకొందురు. కనుపించకుండునంత చిన్న రూపము ధరింతునా, అంత చిన్న రూపముతో లంకనెల్ల వెదకుట కష్టము. కావున చూడదగినంత పెద్దదిగాని, అగపడనంత చిన్నదిగాని కాక మధ్యమరూపము దాల్చి రాత్రికాలమున

న వినశ్యేత్ కథం కార్యం రామస్య విదితాత్మనః,
ఏకా మేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్. 38

భూతాశ్చార్థా విపద్యంతే దేశకాలవిరోధితాః,
విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా. 39

అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాఽపి న శోభతే,
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః. 40

న వినశ్యేత్ కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్,
లంఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్. 41

మయి దృష్టే తు రక్షోభీ రామస్య విదితాత్మనః,
భవేద్ వ్యర్థ మిదం కార్యం రావణానర్థ మిచ్ఛతః. 42

---

జగద్విదితుడగు రాముని కార్యము నశింపకుండు టెట్లు? సీతాదేవి ఒంటరిగా నుండగా నే నొంటరిగ ఏకాంతమున ఆమె నెట్లు చూతును? 38

దాదాపు సిద్ధప్రాయములు (ఫలింపనున్నవి) అగు పనులు కూడ అవివేకియగు దూతచేతిలో పడి, దేశకాలవిరోధము నొంది, సూర్యోదయముచే చీకట్లు నశించిన చందమున చెడిపోవును. 39

ఇది కార్య మిది అకార్యమని కార్యాకార్యములకు సంబంధించి రాజు, మంత్రులు కూడి నిర్ణయించినను, ఆ నిశ్చయరూపమగు బుద్ధి, అవివేకి యగు దూతకడ శోభిల్లదు. తాము పండితులమని (తమ కన్నియు తెలియునని) భావించి అట్టి దూతలు పనులు

న హి శక్యం క్వచిత్ స్థాతు మవిజ్ఞాతేన రాక్షసైః,
అపి రాక్షసరూపేణ కిముతాన్యేన కేనచిత్. 43

వాయుర ప్యత్ర నాజ్ఞాత శ్చరేదితి మతి ర్మమ,
న హ్యస్త్యవిదితం కించి ద్రాక్షసానాం బలీయసామ్. 44

ఇహాహం యది తిష్ఠామి స్వేన రూపేణ సంవృతః,
వినాశ ముపయాస్యామి భర్తు రర్థశ్చ హీయతే. 45

తదహం స్వేన రూపేణ రజన్యాం హ్రస్వతాం గతః,
లంకా మభిపతిష్యామి రాఘవ స్యార్థసిద్ధయే. 46

రావణస్య పురీం రాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్,
విచిన్వన్ భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్. 47

ఇతి సంచింత్య హనుమాన్ సూర్య స్యాస్తమయం కపిః,

---

రాక్షసరూపమునే దాల్చి ఎచటనైన ఉందమన్నను ఈ రాక్షసులకు తెలియకుండుట సాధ్యము కాదు. (వారు తెలిసికొనగలరు). అట్టిచో మరి యే రూపమున నున్నను తెలిసికొనగలరని వేరుగా చెప్పవలెనా? 43

రాక్షసులకు తెలియక వాయువు గూడ సంచరింపదని నా యభిప్రాయము. బలీయులగు రాక్షసులకు తెలియని దేదియు లేదు. 44

ఇచట నిజరూపముతో నెచటనైన దాగియుందునా తప్పక వినాశము [illegible]

ఆచకాంక్షే తదా వీరో వైదేహ్యా దర్శనోత్సుకః. 48

సూర్యే చాస్తం గతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః,
వృషదంశకమాత్ర స్సన్ బభూ వాద్భుతదర్శనః. 49

ప్రదోషకాలే హనుమాం స్తూర్ణ ముత్ప్లుత్య వీర్యవాన్,
ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్తమహాపథామ్. 50

ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచనరాజతైః,
శాతకుంభమయై ర్జాలై ర్గంధర్వనగరోపమామ్. 51

సప్తభౌమాష్టభౌమైశ్చ స దదర్శ మహాపురీమ్,
తలైః స్ఫటికసంకీర్ణైః కార్తస్వరవిభూషితైః. 52

వైడూర్యమణిచిత్రైశ్చ ముక్తాజాలవిభూషితైః,
తలై శ్శుశుభిరే తాని భవనాన్యత్ర రక్షసామ్. 53

---

కలవాడై, సూర్యాస్తమయ మెప్పుడగునా యని వేచియుండెను. 48

సూర్యు డస్తమించి రాత్రి అగుటతోడనే హనుమ తన రూపమును సంకోచపఱచి, చూచువారి కాశ్చర్యము కలిగించుచు పిల్లియంత చిన్నరూపము దాల్చెను. 49

రాత్రి ప్రారంభసమయమున పరాక్రమశాలియగు ఆ హనుమంతుడు శీఘ్రమే ఎగిరి చక్కగా నిర్మింపబడిన పెద్ద పెద్ద రాజమార్గములు కల సుందరమగు లంకానగరమున ప్రవేశించెను. 50

బారులుగా నున్న మహాభవనములతో కూడినదై, బంగారము, వెండితో ... కలిగి, బంగారముతో నిర్మింపబడిన కిటికీలతో,

కాంచనాని విచిత్రాణి తోరణాని చ రక్షసామ్,
లంకా ముద్ద్యోతయామాసు స్సర్వత స్సమలంకృతామ్. 54
అచింత్యా మద్భుతాకారాం దృష్ట్వా లంకాం మహాకపిః,
ఆసీ ద్విషణ్ణో హృష్టశ్చ వైదేహ్యా దర్శనోత్సుకః. 55
స పాండురోద్విద్ధవిమానమాలినీం
మహార్హజాంబూనదజాలతోరణామ్,
యశస్వినీం రావణబాహుపాలితాం
క్షపాచరై ర్భీమబలై స్సమావృతామ్. 56
చంద్రోఽపి సాచివ్య మివాస్య కుర్వం
స్తారాగణై ర్మధ్యగతో విరాజన్,

---

సువర్ణనిర్మితము లగుటచే ఆశ్చర్యకరములగు బహిర్ద్వారములు అంతటను అలంకరింపబడిన ఆ రాక్షసుల లంకను మిక్కిలి ప్రకాశింపజేయుచుండెను. 54

హనుమయు సీతాదేవి నెప్పుడు దర్శింతునా యని యువ్విళ్లూరుచు, ఊహింప నలవి కానిది, అద్భుతరూపము గలది అగు లంకను చూచి దుఃఖితుడు, ఆనందించిన

జ్యోత్స్నావితానేన వితత్య లోక
ముత్తిష్ఠతే నైకసహస్రరశ్మిః. 57
శంఖప్రభం క్షీరమృణాలవర్ణ,
ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్,
దదర్శ చంద్రం స హరిప్రవీరః
పోప్లూయమానం సరసీవ హంసమ్. 58

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే ద్వితీయః సర్గః.*

---

జేయుచు, వేలకొలది కిరణములతో నుదయించెను. 57

వానరవీరుడగు హనుమంతుడును, శంఖము పాలు తామరతూడులవలె ధవళకాంతితో నొప్పుచు, సరస్సునుండి ఎగురుచున్న హంసవలె ఆకాశమున పైపైకి పోవుచున్న చంద్రుని దర్శించెను. 58

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమందు*
*సుందరకాండమున ద్వితీయసర్గము సమాప్తము.*

# 3. తృతీయః సర్గః

*(లంకాధిదేవత హనుమంతుని అడ్డగించుట)*

స లంబశిఖరే లంబే లంబతోయదసన్నిభే,
సత్త్వ మాస్థాయ మేధావీ హనుమాన్ మారుతాత్మజః.
నిశి లంకాం మహాసత్త్వో వివేశ కపికుంజరః,
రమ్యకాననతోయాఢ్యాం పురీం రావణపాలితామ్.
శారదాంబుధరప్రఖ్యై ర్భవనై రుపశోభితామ్,
సాగరోపమనిర్ఘోషాం సాగరానిలసేవితామ్.
సుపుష్టబలసంఘుష్టాం యథైవ విటపావతీమ్,
చారుతోరణనిర్యూహాం పాండురద్వారతోరణామ్.
భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీ మివ,

---

అట్లు సముద్రమును అవలీలగా దాటుట మున్నగు మహాకార్యములు సాధిం
ప్రసిద్ధుడైన వానరోత్తముడు హనుమ, లంబపర్వతశిఖర మొక్కటి వంగి వ్రేలాడుచు
మేఘమువలె నుండగా దానిపై నిలచి, బుద్ధిశాలి కావున అప్పుడు తన కర్తవ్య మే
అని ఆలోచించి, లంకలోనికి చొచ్చుటకు వలయు బలపరాక్రమములు కూడగట్టుకొ

తాం సవిద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గనిషేవితామ్. 5
మందమారుతసంచారాం యథేంద్ర స్యామరావతీమ్,
శాతకుంభేన మహతా ప్రాకారే ణాభిసంవృతామ్. 6
కింకిణీజాలఘోషాభిః పతాకాభి రలంకృతామ్,
ఆసాద్య సహసా హృష్టః ప్రాకార మభిపేదివాన్. 7
విస్మయావిష్టహృదయః పురీ మాలోక్య సర్వతః.
జాంబూనదమయై ర్ద్వారై ర్వైడూర్యకృతవేదికైః, 8
వజ్రస్ఫటికముక్తాభి ర్మణికుట్టిమభూషితైః,
తప్తహాటకనిర్యూహై రాజతామలపాండురైః. 9

---

వెల్లవేయబడి తెల్లదనముతో ప్రకాశింపగా, ద్వారములవద్ద మదపు టేనుగులు కలిగి, నర్పసంచారముచే కాపాడబడుచున్న శుభమైన భోగవతీనగరమువలె రాక్షసవీరసంచారముచే అది సురక్షితమై యుండెను. అచటి భవనములు ఉన్నతములై యుండెను. అందుచే ఆ భవనములలో మెరుపులతో కూడిన మేఘములు వ్యాపించగా, నక్షత్రమార్గమున విలసిల్లుచు పిల్లవాయువులు మెల మెల్లన వీచుచుండగా అది ఇంద్రుని అమరావతిని తలపించుచుండెను. దాని ప్రాకారము మిక్కిలి పెద్దదై, బంగారు వికారమై నగరము చుట్టును నెలకొని యుండెను. చిరుగంటలు మ్రోగుచున్న పతాకలు అంతటను అలంకరించబడి యుండెను. హనుమంతుడు అట్టి లంకాపురికి వేగమే పోయి, ప్రాకారము చేరుకొని, హర్షము నొందెను. 3-7

అతడు ఆ పట్టణమును అన్నివైపులనుండియు పరికించి మిక్కిలి ఆశ్చర్యపడెను. బంగారు ద్వారములు, వైడూర్యఖచితములైన అరుగులు, వజ్ర-స్ఫటిక-ముక్తా- మాణిక్య

వైడూర్యకృతసోపానైః స్ఫాటికాంతరపాంసుభిః,
చారుసంజవనోపేతైః ఖమివోత్పతితై శ్శుభైః. 10
క్రౌంచబర్హిణసంఘుష్టై రాజహంసనిషేవితైః,
తూర్యాభరణనిర్ఘోషై స్సర్వతః ప్రతినాదితామ్. 11
వస్వోకసారాప్రతిమాం తాం వీక్ష్య నగరీం తతః,
ఖమివోత్పతితుం కామాం జహర్ష హనుమాన్ కపిః. 12
తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్,
అనుత్తమా మృద్ధియుతాం చింతయామాస వీర్యవాన్. 13
నేయ మన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్,
రక్షితా రావణబలై రుద్యతాయుధధారిభిః. 14
కుముదాంగదయో ర్వాపి సుషేణస్య మహాకపేః,
ప్రసిద్ధేయం భవే ద్భూమిర్ మైందద్వివిదయో రపి. 15

---

ఆకాశమునకు ఎగురుచున్నట్లున్నవి అగు శుభకరమహోన్నత గృహములతో కూడి, తూర్యములు ఆభరణముల ధ్వనులు ఎల్లెడల మార్మ్రోగగా తూర్పున నున్న ఇంద్రుని వస్వోకసారమను నగరమునకు దీటైన ఆ లంకను చూచి హనుమంతుడు సంతసించెను.
8–12

సుందరమై, మంగళకరమై, ఉత్తమోత్తమమై, సంపత్సమృద్ధమైన రావణుని లంకాపురిని చూచి పరాక్రమశాలి యగు హనుమంతు డిట్లు తలంచెను. 13

వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః,
ఋక్షస్య కేతుమాలస్య మమ చైవ గతి ర్భవేత్. 16
సమీక్ష్య తు మహాబాహూ రాఘవస్య పరాక్రమమ్,
లక్ష్మణస్య చ విక్రాంత మభవత్ ప్రీతిమాన్ కపిః. 17
తాం రత్నవసనోపేతాం కోష్ఠాగారావతంసకామ్,
యంత్రాగారస్తనీ మృద్ధాం ప్రమదామివ భూషితామ్. 18
తాం నష్టతిమిరాం దీప్తై ర్భాస్వరైశ్చ మహాగృహైః,
నగరీం రాక్షసేంద్రస్య దదర్శ స మహాకపిః. 19
అథ సా హరిశార్దూలం ప్రవిశంతం మహాబలమ్,
నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజమ్. 20
సా తం హరివరం దృష్ట్వా లంకా రావణపాలితా,

---

కేతుమాలునకు, నాకును ఈ నగరము చేరశక్యమగును. (ఇచట హనుమ తన పే
చివఱ చెప్పుట ఆయన వినయమునకు సూచకము.) 1

అంతట మహాభుజుడగు హనుమంతుడు రామలక్ష్మణుల విక్రమమును ఊహిం
(వా రనాయాసముగ లంకను జయింపగలరని తలంచి) సంతుష్టుడయ్యెను. 1

అతడు రత్నములే వస్త్రములుగా కలిగి, సామగ్రి నిలువచేయు కోష్ఠములే (కొ

స్వయమే వోత్థితా తత్ర వికృతాననదర్శనా. 21
పురస్తాత్ కపివర్యస్య వాయుసూనో రతిష్ఠత,
ముంచమానా మహానాద మబ్రవీత్ పవనాత్మజమ్. 22
కస్త్వం కేన చ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ,
కథయ స్వేహ యత్తత్త్వం యావత్ ప్రాణా ధరంతి తే. 23
న శక్యం ఖల్వియం లంకా ప్రవేష్టుం వానర త్వయా,
రక్షితా రావణబలై రభిగుప్తా సమంతతః. 24
అథ తా మబ్రవీ ద్వీరో హనుమా నగ్రతః స్థితామ్,
కథయిష్యామి తే తత్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి. 25
కా త్వం విరూపనయనా పురద్వారేఽవతిష్ఠసి,
కిమర్థం చాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా. 26

---

ముఖము, కండ్లు కలదై లేచి అతడున్నచోటనే నిలచెను. 21

ఆమె యట్లు వాయుపుత్రుడగు హనుమంతుని యెదుట నిలచి, పెద్దగా అఱచుచు ఇట్లనెను. 22

"ఓ వానరా! నీవెవ్వడవు? ఏ పనికై యిటకు వచ్చితివి? నీ ప్రాణములున్నంత లోపల 'ప్రాణాన్ హరామి' అను పాఠమున నీ ప్రాణములు తీయులోపల అని యర్థము) నీ విపుడు వాస్తవము తెలుపుము

హనుమద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ,
ఉవాచ వచనం క్రుద్ధా పరుషం పవనాత్మజమ్. 27

అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః,
ఆజ్ఞాప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీ మిమామ్. 28

న శక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా,
అద్య ప్రాణైః పరిత్యక్తః స్వప్స్యసే నిహతో మయా. 29

అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ,
సర్వతః పరిరక్షామి హ్యేతత్తే కథితం మయా. 30

లంకాయా వచనం శ్రుత్వా హనుమాన్ మారుతాత్మజః,
యత్నవాన్ స హరిశ్రేష్ఠః స్థిత శ్శైల ఇవాపరః. 31

స తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా వానరపుంగవః,
ఆబభాషేఽథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః. 32

---

హనుమంతుని మాట విని కామరూపిణి యగు ఆ లంక కోపముతో ఇట్లు కఠినముగా పలికెను. 27

"నేను రాక్షసరాజు, మహాత్ముడగు రావణుని ఆజ్ఞను శిరసావహించుదానను. నన్నెదిరింప నెవ్వరికిని సాధ్యము కాదు. నే నీ నగరమును కాపాడుచుందును. 28

న న్నవమానించి (లక్ష్యము చేయక) నీ వీ నగరమున ప్రవేశింపలేవు. నీ విపుడే ప్రాణములు వీడి దీర్ఘనిద్ర వోయెదవు లెమ్ము. 29

వానరుడా! నేను లంకను. నేనే యన్నివైపులనుండి యీ నగరమును రక్షింతునని 30

ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్టప్రాకారతోరణామ్,
ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. 33
వనా న్యుపవనా నీహ లంకాయాః కాననాని చ,
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే. 34
తస్య తద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ,
భూయ ఏవ పున ర్వాక్యం బభాషే పరుషాక్షరమ్. 35
మా మనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వరపాలితామ్,
న శక్య మద్య తే ద్రష్టుం పురీయం వానరాధమ. 36
తత స్స కపిశార్దూల స్తా మువాచ నిశాచరీమ్,
దృష్ట్వా పురీ మిమాం భద్రే పునర్యాస్యే యథాగతమ్. 37
తతః కృత్వా మహానాదం సా వై లంకా భయావహమ్,
తలేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా. 38

---

"కోటబురుజులు, ప్రాకారములు, బహిర్ద్వారములతో కూడిన లంకానగరమును చూడగోరి వచ్చితిని. నా కీ నగరిని చూడవలెనని మిక్కిలి కోరిక కలదు. 33

లంకలోని వనములు, ఉపవనములు, అడవులు, ప్రధానములగు యిండ్లు చూచుటకే వచ్చితిని." 34

అతడు పలికిన ఆ మాట విని కామరూపిణి యగు లంక మఱల నిట్లు కఠినోక్తులు

తత స్స కపిశార్దూలో లంకయా తాడితో భృశమ్,
ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః. 39

తత స్సంవర్తయామాస వామహస్తస్య సోఽంగులీః,
ముష్టినాఽభిజఘానైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః. 40

స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధః స్వయం కృతః . 41

సా తు తేన ప్రహారేణ విహ్వలాంగీ నిశాచరీ,
పపాత సహసా భూమౌ వికృతాననదర్శనా. 42

తతస్తు హనుమాన్ ప్రాజ్ఞస్తాం దృష్ట్వా వినిపాతితామ్,
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియం తు తామ్. 43

తతో వై భృశసంవిగ్నా లంకా సా గద్గదాక్షరమ్,
ఉవాచాగర్వితం వాక్యం హనుమంతం ప్లవంగమమ్. 44

---

చాచి యా వానరశ్రేష్ఠుని కొట్టెను. 38

లంక తన్నట్లు తీవ్రముగ కొట్టగా పరాక్రమశాలి అగు హనుమంతుడు పెద్దగా ధ్వని చేసెను. 39

పిమ్మట కోపము పెల్లుబుకగా ఆ హనుమంతుడు తన ఎడమ చేతి వ్రేళ్ళు ముడుచుకొని, పిడికిలితో నామెను కొట్టెను. 40

ఆమె స్త్రీ కావున చంపరాదని హనుమంతు డామెపై మిక్కిలి కోపము చూపలేదు.

ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ,
సమయే సౌమ్య తిష్ఠంతి సత్త్వవంతో మహాబలాః. 45
అహం తు నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ,
నిర్జితాహం త్వయా వీర విక్రమేణ మహాబల. 46
ఇదం తు తథ్యం శృణు వై బ్రువంత్యా మే హరీశ్వర,
స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ. 47
యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశ మానయేత్,
తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్. 48
స హి మే సమయ స్సౌమ్య ప్రాప్తోఽద్య తవ దర్శనాత్,
స్వయంభూవిహిత స్సత్యో న తస్యాస్తి వ్యతిక్రమః. 49
సీతానిమిత్తం రాజ్ఞస్తు రావణస్య దురాత్మనః,

---

"ఓ మహాభుజుడవగు హనుమంతుడా! నాయందు ప్రసన్నుడవు కమ్ము. కపిశ్రేష్ఠుడా! నన్ను కాపాడుము. సౌమ్యుడా! ధీరులు, మహాబలులు 'స్త్రీలను చంపరా' దను నియమము పాటింతురు. 45

ఓ వానరుడా! నీ కగపడు ఈ లంకాపురిని నేనే. వీరుడవు, మహాబలుడవగు నీవు పరాక్రమముచే నన్ను జయించితివి. 46

ఓ వానరేశ్వరా! పూర్వము నాకు బ్రహ్మ వరమిచ్చినాడు. ఆ వరమేమో

రక్షసాం చైవ సర్వేషాం వినాశ స్సముపాగతః. 50
తత్ ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీం రావణపాలితామ్,
విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాంఛసి. 51
ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర
శ్శుభాం పురీం రాక్షసముఖ్యపాలితామ్,
యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీం
విమార్గ సర్వత్ర గతో యథాసుఖమ్. 52

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే తృతీయః సర్గః.*

---

వినాశకాల మాసన్నమైనది. 50

కావున ఓ కపిశ్రేష్ఠుడా! రావణుడు పాలించు లంకానగరమును ప్రవేశించి, ఏ యే కార్యములు చేయదలంచితివో వాని నెల్ల యాచరించుము. 51

ఓ వానరేశ్వరా! మంగళకరమైనది, రాక్షసముఖ్యుడగు రావణునిచే పరిపాలింపబడుచున్నది, యిట్లు శాపముచే బలహీనపడినది యగు లంకలో ప్రవేశించి, సుఖముగా నెల్లెడల తిరుగుచు సాధ్వియగు సీతాదేవిని వెదకుము." అని లంక హనుమంతునితో పలికెను. 52

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమున తృతీయ సర్గము.*

# 4. చతుర్థః సర్గః

*(హనుమంతుడు లంకలో ప్రవేశించుట)*

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః,
[1]అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే. 1

ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః,
చక్రే ఽథ పాదం [2]సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని. 2

మహాపరాక్రమశాలి, మహాభుజుడు, వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు, కామరూపముగల శ్రేష్ఠనగరమగు లంక నట్లు పరాక్రమముచే జయించి, ద్వారము కానట్టి ప్రదేశమున ప్రాకారమును దాటెను. 1

సుగ్రీవునకు హితము గూర్చువాడగు హనుమంతుడు, తన ఎడమ పాదమును లంకలో శత్రువుల శిరముపై నిడినట్లు మోపి ప్రవేశించెను. 2

1. హనుమ ద్వారమున పోకుండుటకు రెండు కారణములు. ఒకటి లంకాపరాజయము రాక్షసులకు తెలియకుండుట. రెండు –

"శ్లో. గ్రామం వా నగరం వాపి పత్తనం వా పరస్య హి,
విశేషాత్ సమయే సౌమ్య న ద్వారేణ విశే న్నృపః".

(రాజు లేక రాజపురుషుడు శత్రునగరము, లేదా గ్రామము నొక విశిష్టకార్యసాధనకై ప్రవేశింపవలసినపుడు ప్రధానద్వారమున పోరాదు) అను వచనము.

2. ప్రయాణసమయము, గృహప్రవేశము, వివాహము ఈ సందర్భములలో మొదట కుడిపాదము నుంచియు, శత్రునగరమున ప్రవేశించునపుడు ఎడమ పాదము

ప్రవిష్ట స్సత్త్వసంపన్నో నిశాయాం మారుతాత్మజః. 3
స మహాపథ మాస్థాయ ముక్తాపుష్పవిరాజితమ్,
తతస్తు తాం పురీం లంకాం రమ్యామభియయౌ కపిః. 4
హసితోత్కృష్టనినదై స్తూర్యఘోషపురస్సరైః,
వజ్రాంకుశనికాశైశ్చ వజ్రజాలవిభూషితైః,
గృహమేఘైః పురీ రమ్యా బభాసే ద్యౌ రివాంబుదైః. 5
ప్రజజ్వాల తదా లంకా రక్షోగణగృహై శ్శుభైః,
సితాభ్రసదృశై శ్చిత్రైః పద్మ [1]స్వస్తికసంస్థితైః,

బలవంతుడగు హనుమంతుడు రాత్రివేళ లంకలో ప్రవేశించి ముత్యములతో పూలతో ప్రకాశించు రాజమార్గమున పోయెను. అత డట్లు రాజమార్గమును బట్టి సుందరమగు లంకానగరమున తిరుగజొచ్చెను. 3–4

ఆ లంకానగరమున నృత్తగీతవాద్యధ్వనులు, అట్టహాసములును బోరుకొలుపు చుండెను. ఐరావతము వలె తెల్లనై, వజ్రఖచితములైనవి, వజ్ర, అంకుశ రూపములతో నిర్మించబడినవి అగు మేలైన యిండ్లతో కూడిన ఆ లంక మేఘములతో ఆకాశమువలె ప్రకాశించెను. 5

పద్మము, స్వస్తిక మను నిర్మాణవిశేషము గలవి, వర్ధమాన మను లక్షణము గలవి, తెల్లని మేఘములవలె నున్నవి, ఆశ్చర్యము గొల్పునవి యగు ఉత్తమములగు

"ప్రయాణకాలే చ గృహప్రవేశే వివాహకాలేఽ పి చ దక్షిణాంఘ్రిమ్,
కృత్వాగ్రత శ్శత్రుపురప్రవేశే వామం నిదధ్యా చ్చరణం నృపాలః."

1 స్వస్తికము లనబడు గృహములు చతురస్రాకృతి కలవి –
చతుశ్శాలా చతుర్ద్వారా సర్వతోభద్రసంజ్ఞితా,

వర్ధమానగృహై శ్చాపి సర్వత స్సువిభూషితా. 6
తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః,
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననంద చ. 7
భవనా ద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః,
వివిధాకృతిరూపాణి భవనాని తత స్తతః. 8
శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్,
స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసా మివ. 9
శుశ్రావ కాంచీనినదం నూపురాణాం చ నిస్వనమ్,
సోపాననినదాం శ్చైవ భవనేషు మహాత్మనామ్. 10
ఆస్ఫోటితనినాదాంశ్చ క్ష్వేళితాంశ్చ తత స్తతః,

---

రాక్షసుల గృహములతో నా లంకాపురి యంతటను చక్కగా అలంకరింపబడి యుండెను. 6

స్వామికార్యమును సాధించుట యను సంపదతో నలరారు హనుమంతుడు సుగ్రీవునకు హితము గూర్చువాడై, రాముని పనికై తిరుగుచు, విచిత్ర పుష్పమాలాలంకృతమగు లంకను చూచి 'దుష్ప్రవేశమగు లంకలో ప్రవేశింప గలిగితిని. కావున తప్పక రామసుగ్రీవుల మనోరథ మీడేరు' నని తలంచి యానందించెను. 7

వాయుపుత్రుడగు హనుమ లంకలో నొక భవనమునుండి వేఱొక భవనమున కేగుచు, పలు అకృతులుగల భవనములను చూచెను. 8

శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షోగృహేషు వై. 11
స్వాధ్యాయనిరతాంశ్చైవ యాతుధానాన్ దదర్శ సః,
రావణస్తవసంయుక్తాన్ గర్జతో రాక్షసా నపి. 12
రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్,
దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరాన్ బహూన్. 13
దీక్షితాన్ జటిలాన్ ముండాన్ గోఽజినాంబరవాససః,
దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాం స్తథా. 14
కూటముద్గరపాణీంశ్చ దండాయుధధరానపి,
ఏకాక్షా నేకకర్ణాంశ్చ లంబోదరపయోధరాన్. 15

---

ధ్వనిని, సింహనాదములను, జపము చేయువారు పలుకు వివిధ వేదమంత్రములను వినెను. 10,11

హనుమంతుడు వేదాధ్యయనము చేయువారును, రావణుని స్తోత్రము చేయుచు గర్జించువారును అగు రాక్షసుల నాదములు వినెను. 12

అతడు రాజమార్గము నావరించి నిలచిన పెద్ద రాక్షససేనను, నగరపు నడిమి ప్రదేశమున రావణుడు తనవారి వృత్తాంతము రహస్యముగా తెలిసికొనుటకు నియమించిన చారు లనేకులను చూచెను. 13

హనుమంతు డచట దీక్షలో నున్నవారు, జడలు దాల్చినవారు, బోడితలవారు, ఎద్దుతోలు కట్టుకున్నవారు, దిగంబరులు, దర్భలు ధరించిన పిడికిళ్లే ఆయుధములుగా దాల్చినవారు, జయము కోరి హోమము చేయుటచే అగ్నికుండములే ఆయుధములుగా కలవారును, కూటములు, ముద్గరములు, దండములు అను ఆయుధములు చేత పట్టినవారును, ఒంటి కంటి వారును, ఒంటిచెవి వారును, వ్రేలాడు పొట్టి స్తనములు గలవారు, భయంకరులును, వంకర మొగమువారును, విషమావయవములు

కరాళాన్ భుగ్నవక్త్రాంశ్చ వికటాన్ వామనాంస్తథా,
ధన్వినః ఖడ్గిన శ్చైవ శతఘ్నీముసలాయుధాన్. 16
పరిఘోత్తమహస్తాంశ్చ విచిత్రకవచోజ్జ్వలాన్,
నాతిస్థూలా న్నాతికృశా న్నాతిదీర్ఘాతిహ్రస్వకాన్.
నాతిగౌరా న్నాతికృష్ణా న్నాతికుబ్జాన్న వామనాన్. 17
విరూపాన్ బహురూపాంశ్చ సురూపాంశ్చ సువర్చసః,
ధ్వజీన్ పతాకిన శ్చైవ దదర్శ వివిధాయుధాన్. 18
శక్తివృక్షాయుధాం శ్చైవ పట్టిసాశనిధారిణః,
క్షేపణీపాశహస్తాంశ్చ దదర్శ స మహాకపిః. 19
స్రగ్విణ స్త్వనులిప్తాంశ్చ వరాభరణభూషితాన్,

---

ఆయుధవిశేషము చేత ధరించినవారును, ఆశ్చర్యము గొలుపు కనులతో ప్రకాశించువారును, మిక్కిలి లావులేని వారును, మిక్కిలి సన్నగిలి యుండనివారును, మిక్కిలి పొడవు లేని వారును, మిక్కిలి పొట్టిదనము లేనివారును, మిక్కిలి తెల్లదనము లేనివారును, మిక్కిలి నల్లదనము లేనివారును, మిక్కిలి గూనిలేనివారును, మిక్కిలి మరిగుజ్జులు గానివారును, చక్కని తేజస్సు కలవారును, రాజచిహ్నాములు గలవి, లేనివి యగు టెక్కెములు పట్టుకొనినవారును అగు పలువురు ఆయుధధారులను చూచెను.

14-18

ఆ మహాకపి హనుమ, శక్తి యను దానిని, వృక్షములను ఆయుధములుగా దాల్చినవారును, పదునైన యినుపకత్తిని, అశని యను ఆయుధమును దాల్చినవారును, పడవతెడు, [illegible]

నానావేషసమాయుక్తాన్ యథా స్వైరగతాన్ బహూన్,
తీక్ష్ణశూలధరాం శ్చైవ వజ్రిణశ్చ మహాబలాన్. 20
శతసాహస్ర మవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః,
రక్షోధిపతినిర్దిష్టం దదర్శాంతఃపురాగ్రతః. 21
స తదా తద్గృహం దృష్ట్వా మహాహాటకతోరణమ్,
రాక్షసేంద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్. 22
పుండరీకావతంసాభిః పరిఖాభి రలంకృతమ్,
ప్రాకారావృత మత్యంతం దదర్శ స మహాకపిః. 23
త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాదవినాదితమ్,
వాజిహేషితసంఘుష్టం నాదితం భూషణై స్తదా. 24
రథై ర్యానై ర్విమానైశ్చ తథా హయగజై శ్శుభైః,

---

దాల్చినవారును, మహాబలము గలవారును అగు రాక్షసుల నచట హనుమ చూచెను. 20

ఏమరుపాటు లేక రావణునిచే నాజ్ఞాపించబడినవారై నగరము నడుమ అంతః పురమునకు ఎదుట కావలియున్న లక్ష సైనికులను హనుమంతుడు చూచెను. 21

అంత హనుమంతుడు బంగారముతో నిర్మితమైన బహిర్ద్వారము కలిగిన రావణ భవనమును చూచెను. అది యొక పర్వతశిఖరముపై నెలకొనియుండెను. 22

మహాకపి హనుమంతుడు తెల్లతామరలతో శోభిల్లు అగడ్తలు కలిగి, ప్రాకార పరివేష్టితమైన ఆ భవనమును తిలకించెను. 23

ఆ భవనము దేవలోకమువలె దివ్యమై యుండెను. శ్రేష్ఠములగు వివిధధ్వనులును, గుఱ్ఱముల సకిలింతలు, స్త్రీపురుషులు ధరించిన కనక కంకణ మణి మంజీరాది భూషణ ధ్వనులును అందు మారుమ్రోగుచుండెను. 24

వారణైశ్చ చతుర్దంతైః శ్వేతాభ్రనిచయోపమైః. 25
భూషితం రుచిరద్వారం మత్తైశ్చ మృగపక్షిభిః,
రక్షితం సుమహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః,
రాక్షసాధిపతే ర్గుప్త మావివేశ మహాకపిః. 26
స హేమజాంబూనదచక్రవాళం మహార్హముక్తామణిభూషితాంతమ్,
పరార్ధ్యకాలాగురుచందనాక్తం స రావణాంతఃపుర మావివేశ. 27

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే చతుర్థః సర్గః.*

---

యేనుగులు, వలసినంతగా ఆహార విహారము లొనర్చి మత్తిల్లిన మృగములు, పక్షులు అందు శోభిల్లుచుండెను. ఆ భవనద్వారము కడు సుందరమై యుండెను. ఆ ద్వారదేశమున మహాపరాక్రమశాలులగు వేలాది రాక్షసులు కావలియుండిరి. అట్టి ఆ భవనమున హనుమ ప్రవేశించెను. 25,26

ఆ హనుమంతుడు జంబూనదియందు, మఱియు వేఱు ప్రదేశము లందును పుట్టిన రెండు విధములైన బంగారముచేతను పూయబడిన ప్రాకారము కలది, గొప్ప వెలగల ముత్యములతో నలంకరింపబడినది, మేలైన నల్లని అగురువు, చందనములు పూయబడినది అగు రావణుని అంతఃపురమున ప్రవేశించెను. 27

# 5. పంచమః సర్గః

*(హనుమంతుడు లంకలో సీతను వెదకుట)*

తత స్స మధ్యంగత మంశుమంతం, జ్యోత్స్నావితానం మహదుద్వమంతమ్,
దదర్శ ధీమాన్ దివి భానుమంతం, గోష్ఠే వృషం మత్తమివ భ్రమంతమ్. 1
లోకస్య పాపాని వినాశయంతం, మహోదధిం చాపి సమేధయంతమ్,
భూతాని సర్వాణి విరాజయంతం, దదర్శ శీతాంశు మథాభియాంతమ్. 2
యా భాతి లక్ష్మీ ర్భువి మందరస్థా, తథా ప్రదోషేషు చ సాగరస్థా,
తథైవ తోయేషు చ పుష్కరస్థా రరాజ సా చారునిశాకరస్థా. 3
హంసో యథా రాజతపంజరస్థః, సింహో యథా మందరకందరస్థః

---

పిమ్మట బుద్ధిమంతుడగు హనుమంతుడు, ఆకాశము నడుమ విలసిల్లుచు, వెన్నెల పిండును మెండుగా వెదజల్లుచు, ఆవుల మందలో తిరుగు ఆబోతు వలె నున్న చంద్రుని చూచెను. 1

హనుమంతుడు జనుల పాపఫలమగు దుఃఖములను పోగొట్టువాడును, సముద్రమును వృద్ధినొందించువాడును, సకలప్రాణులను ప్రకాశింపజేయువాడును అగు చంద్రు డాకసమున పోవుచుండుట చూచెను. 2

భూమిపై మందరపర్వతమున కెట్టి కాంతి గలదో, సాయంకాలములలో సముద్రము నం దెట్టి ప్రకాశముండునో, జలములలో కమలములం దే వెలుగుండునో అట్టి ప్రకాశమే చంద్రునియందు సుందరముగా నుండెను. 3

(ఆకాశగర్భమంతయు వెన్నెలతో నిండి యుండుటచే) వెండిపంజరమం దున్న హంసవలెను, (శ్వేతగిరి యగుటచే) మందరపర్వతపు గుహయం దున్న సింహమువలెను, (ఆకాశము నల్లని రూపము గల దగుటచే) మదించిన యేనుగు

వీరో యథా గర్వితకుంజరస్థః, చంద్రో విబభ్రాజ తథాంబరస్థః. 4
స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగో, మహాచలః శ్వేత ఇవోచ్చశృంగః,
హస్తీవ జాంబూనదబద్ధశృంగో, రరాజ చంద్రః పరిపూర్ణశృంగః5
వినష్టశీతాంబుతుషారపంకో, మహాగ్రహగ్రాహవినష్టపంకః,
ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకో, రరాజ చంద్రో భగవాన్ శశాంకః. 6
శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో, మహారణం ప్రాప్య యథా గజేంద్రః
రాజ్యం సమాసాద్య యథా నరేంద్ర, స్తథా ప్రకాశో విరరాజ చంద్రః. 7
ప్రకాశచంద్రోదయనష్టదోషః, ప్రవృత్తరక్షఃపిశితాశదోషః,
రామాభిరామేరితచిత్తదోషః, స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః. 8

---

నెక్కిన వీరునివలెను, ఆకాశమున చంద్రు డధికముగ ప్రకాశించెను. 4

వాడియైన కొమ్ములు గల (తెల్లని) యెద్దువలెను, ఎత్తైన శిఖరములు గల తెల్లని కొండవలెను, బంగారు తొడుగు వేయబడిన కోరలుగల ఐరావతము వలెను, సకల కళాపరిపూర్ణుడై చంద్రుడు ప్రకాశించెను. 5

హిమరూపమగు మాలిన్యము తొలగినవాడును, మహాగ్రహములగు శుక్ర బృహస్పత్యాదులు కప్పి విడచుటచే (లేదా తన తేజముతో మహాగ్రహములను కూడా తిరస్కరించుటచే) వ్యక్తమైన నిర్మలత గలవాడును, లేదా మహాగ్రహ మగు సూర్యుని కిరణములను స్వీకరించుటచే నశించిన యంధకారము గలవాడును, గొప్ప కాంతిని పొందుటచే స్పష్టముగ నగపడుచున్న మచ్చకలవాడు నై మహాప్రభావశాలి చంద్రుడు ప్రకాశించెను. 6

ఎత్తైన రాతిపై నిలచిన సింహము వలె, మహాయుద్ధము చేయునపుడు ఏనుగు వలె, రాజ్యము సంపాదించినపుడు రాజువలె, చంద్రుడు కాంతిమంతుడై యొప్పెను. 7

ప్రకాశమానుడగు చంద్రు డుదయించుటచే చీకటులు తొలగినదై, రక్షస్సులు మాంసభక్షులగు వారి సంచారము విరివిగా నుండుటచే దోషవంతమై, సుందరాంగనల వారి ప్రియుల కోపరూపమగు అభిమానమును పారద్రోలునదై, స్వర్గమువలె ఆనందప్రదము శ్రీమంతమునైన ప్రదోషకాలము (సాయంకాలము) గడిచినది. 8

తంత్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తాః, స్వపంతి నార్యః పతిభిస్సువృత్తాః
నక్తంచరాశ్చాపి తథా ప్రవృత్తా,విహర్తుమత్యద్భుతరౌద్రవృత్తాః. 9
మత్తప్రమత్తాని సమాకులాని రథాశ్వభద్రాసనసంకులాని,
వీరశ్రియా చాపి సమాకులాని దదర్శ ధీమాన్ స కపిః కులాని. 10
పరస్పరం చాధిక మాక్షిపంతి, భుజాం శ్చ పీనా నధివిక్షిపంతి,
మత్తప్రలాపా నధికం క్షిపంతి, మత్తాని చాన్యోన్య మధిక్షిపంతి. 11
రక్షాంసి వక్షాంసి చ విక్షిపంతి, గాత్రాణి కాంతాసు చ విక్షిపంతి,
రూపాణి చిత్రాణి చ విక్షిపంతి, దృఢాని చాపాని చ విక్షిపంతి. 12
దదర్శ కాంతాశ్చ సమాలభంత్య, స్తథా పరాస్తత్ర పునః స్వపంత్యః

---

వీనులవిం దొనరించు వీణావాద్యములు వినవైనవి. పతివ్రతలగు కాంతలు తమ పతులతో గూడి శయనించిరి. మిక్కిలి ఆశ్చర్యము కలిగించు భీకరకృత్యములు చేయుచు రాక్షసులు విహరింపసాగిరి. 9

పరాక్రమశాలి, ధీమంతుడగు హనుమ, మద్యపానముచే మదించినవారితోడను ఏమఱుపాటు గల జనులతోడను కూడినవి, జనసమ్మర్దము కలవి, రథ గజ తురంగములు, ఉత్తమాసనములతో నిండినవి, వీరలక్ష్మితో నొప్పునవి యగు గృహములను చూచెను. 10

అచట ఒండొరుల నధికముగా అధిక్షేపము జేసికొనువారును, బలిసిన భుజముల నొండొరులపై వేయువారును, త్రాగినవారు చేయునట్టి ప్రలాపము లధికముగా చేయుచున్నవారును, మత్తెక్కి తమలో తా మధిక్షేపము చేసుకొనువారును, ఱొమ్ములు విఱుచుకొనుచున్నవారును, భార్యలపై (కాలు, చేతులు మున్నగు) అవయవములు వేయువారును, విచిత్రరూపములు దాల్చినవారును, గట్టి విండ్లను ఎక్కుపెట్టి తిరుగువారును అగు రాక్షసులను హనుమ చూచెను. 11,12

అచట కొందరు స్త్రీ లొడలికి చందనాదులు పూసుకొనుచుండిరి. మఱికొందరు

సురూపవక్త్రాశ్చ తథా హసంత్యః, క్రుద్ధాః పరాశ్చాపి వినిశ్శ్వసంత్యః. 13

మహాగజై శ్చాపి తథా నదద్భిః, సుపూజితై శ్చాపి తథా సుసద్భిః,
రరాజ వీరైశ్చ వినిశ్శ్వసద్భిః, హ్రదో భుజంగై రివ నిశ్వసద్భిః. 14

బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్, సంశ్రద్దధానాన్ జగతః ప్రధానాన్,
నానావిధానాన్ రుచిరాభిధానాన్, దదర్శ తస్యాం పురి యాతుధానాన్. 15

ననంద దృష్ట్వా స చ తాన్ సురూపాన్, నానాగుణా నాత్మగుణానురూపాన్,
విద్యోతమానాన్ స తదానురూపాన్, దదర్శ కాంశ్చిచ్చ పునర్విరూపాన్. 16

తతో వరార్హా స్సువిశుద్ధభావా, స్తేషాం స్త్రియ స్తత్ర మహానుభావాః,
ప్రియేషు పానేషు చ సక్తభావా, దదర్శ తారా ఇవ సుప్రభావాః. 17

---

వనితలు నిట్టూర్చుచుండిరి. 13

ఘీంకరించు మదపుటేనుగులతో, పూజితులైన సత్పురుషులతో, యుద్ధమునకు తగిన ప్రతివీరులు లేక నిట్టూర్చు వీరులతో, ఆ పట్టణము నిట్టూర్చు పాములతో మడుగువలె నొప్పెను. 14

హనుమంతు డట శ్రేష్ఠబుద్ధులును, మనోహరనామధారులును, మిగుల శ్రద్ధాళువులును, నానాకారములు గలవారును, చక్కగా వ్యవహరించువారును అగు రాక్షసముఖ్యులను చూచెను. 15

పలువిధములగు ఉత్తమగుణములు కలవారు, తమ గుణములకు తగినట్లు వ్యవహరించువారును, సుందరరూపులును, అట్లే తేజోవంతులై తదనురూపములగు గుణములు కలవారును అగు కొందఱు వికృతాకారులను హనుమంతుడు చూచెను. 16

శ్రేష్ఠులగు పురుషులకు తగినవారును, భర్తల యెడ నిర్మలహృదయము కలవారును, పాతివ్రత్యమను గొప్ప ప్రభావము గలవారును (లేక గొప్ప కటాక్షభుజాక్షేపాది అనుభావములు కలవారును), తమ పతులయెడను పానమందును ఆసక్తి గలవారును, గొప్పకాంతిగల నక్షత్రముల వలె వెలుగొందువారును అగు స్త్రీల నచట నాగుతి

శ్రియా జ్వలంతీ స్త్రపయోపగూఢా
నిశీథకాలే రమణోపగూఢాః,
దదర్శ కాశ్చిత్ ప్రమదోపగూఢా
యథా విహంగాః కుసుమోపగూఢాః. 18

అన్యాః పున ర్హర్మ్యతలోపవిష్టా, స్తత్ర ప్రియాంకేషు సుఖోపవిష్టాః,
భర్తుః ప్రియా ధర్మపరా నివిష్టా, దదర్శ ధీమాన్ మదనాభివిష్టాః. 19

అప్రావృతాః కాంచనరాజివర్ణాః, కాశ్చి త్పరార్థ్యా స్తపనీయవర్ణాః,
పునశ్చ కాశ్చిత్ శశలక్ష్మవర్ణాః, కాంతప్రహీణా రుచిరాంగవర్ణాః. 20

తతః ప్రియాన్ ప్రాప్య మనోభిరామాన్,
సుప్రీతియుక్తాః ప్రసమీక్ష్య రామాః
గృహేషు హృష్టాః పరమాభిరామా,
హరిప్రవీర స్స దదర్శ రామాః. 21

---

అచట కాంతితో నొప్పువారును, అర్ధరాత్రిసమయమున పతులతో గూడి సిగ్గుపడువారును, హర్షపరిపూర్ణలును, పుష్పాలంకృతలై పూలచే గప్పబడిన పక్షులవలె నున్నవారును అగు స్త్రీలను హనుమ చూచెను. 18

కొందరు స్త్రీలు మేడలపైన తమ పతుల తొడలపై గూర్చుండి వారి కానందము కలిగించుచుండగా, మఱికొందరు ధర్మతత్పరలగు వనితలు భర్తలకు ప్రీతి గూర్చుచు మదనపరవశలై యుండగా హనుమ చూచెను. 19

కొందఱు వనితలు ముసుగులు తీసివేసికొని బంగారు రేఖలవలె మెఱయుచుండిరి. కొందఱు మేలిమి బంగారమువలె ప్రకాశించుచుండిరి. మఱికొందరు పతుల నెడబాసి చంద్రుని వలె తెల్లగా నుండిరి. ఇంకను కొందరు సుందరశరీరవర్ణము కలిగియుండిరి.

హనుమంతు డచట, తమ ప్రియుల చెంత కభిసారికలై పోయి తత్సమాగమముచే మిక్కిలి సంతోషము నందిన కొందరు సుందరాంగనలను, తమ గృహములందే 21

చంద్రప్రకాశాశ్చ హి వక్త్రమాలా, [1]వక్రాక్షిపక్ష్మాశ్చ సునేత్రమాలాః,
విభూషణానాం చ దదర్శ మాలాః, శతహ్రదానా మివ చారుమాలాః. 22
న త్వేవ సీతాం పరమాభిజాతాం, పథి స్థితే రాజకులే ప్రజాతామ్,
లతాం ప్రఫుల్లామివ సాధుజాతాం, దదర్శ తన్వీం [1]మనసాభిజాతామ్. 23
సనాతనే వర్త్మని సన్నివిష్టాం రామేక్షణాం తాం మదనాభివిష్టామ్,
భర్తుర్మనః శ్రీమదనుప్రవిష్టాం, స్త్రీభ్యో వరాభ్యశ్చ సదా విశిష్టామ్. 24

---

ఆ హనుమ సీతాన్వేషణము చేయుచు, చంద్రునివలె ప్రకాశించు రాక్షసాంగనల మోములను, వంకరయైన ఱెప్పవెండ్రుకలుగల వారి సుందరనేత్రములను, మెఱుపుతీగల వలె కాంతిమంతములగు వారి యాభరణములను చూచెను. 22

అంతేకాని పరమసౌందర్యవతి, సన్మార్గనిష్ఠమగు రాజవంశమున పుట్టినది, గోముగా నెదిగి, విలసిల్లు పూదీగె వలె కోమలశరీరము కలది, తన సంకల్పమాత్రముననే అయోనిజయై జన్మించినది అగు సీతాదేవిని కానడయ్యెను. 23

అవిచ్ఛిన్న మగు పాతివ్రత్యధర్మము నవలంబించినది, రాముని దర్శింపగలనను నిశ్చయబుద్ధి గలది, మన్మథావేశము నొందినది, తన్నే తలంచు రాముని హృదయమున

---

1 ముఖములు, నేత్రములను చూచుట మానవరాక్షసభేదము తెలియుకొఱకు. వారి యాభరణములు చూచుట రాముడు చెప్పిన సీతాభరణము లగునో కాదో నిర్ణయించుకొనుటకు. ఈ విషయము 15వ సర్గలోని క్రింది శ్లోకముల వలన తేటతెల్లమగును.

'తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీమనిందితామ్,
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః.
వైదేహ్యా యాని చాంగేషు తదా రామోఽన్వకీర్తయత్,
తా న్యాభరణజాలాని శాఖాశోభీ న్యలక్షయత్.

(రాజపుత్రిక యగుట, విశాలనయనములు కలిగియుండుట, రాముడు ముందు పేర్కొనిన ఆభరణములు కలిగియుండుటచే హనుమ ఆమె సీత యని నిశ్చయించెను).

[1]యస్మాత్తు ధర్షితా చాహ మపాపా చాప్యనాథవత్,
తస్మాత్తవ వధార్థం వై ఉత్పత్స్యేఽహం ధ్రువం పునః.
అను ఉత్తరకాండ శ్లోకము ననుసరించి సీతాదేవి స్వసంకల్పముచేతనే జనించెనని

ఉష్ణార్దితాం సానుసృతాస్రకంఠీం పురా వరార్హోత్తమనిష్కకంఠీమ్,
సుజాతపక్ష్మామభిరక్తకంఠీం వనే ప్రనృత్తామివ నీలకంఠీమ్. 25

అవ్యక్తరేఖామివ చంద్రరేఖాం పాంసుప్రదిగ్ధామివ హేమరేఖామ్,
క్షతప్రరూఢామివ బాణరేఖాం వాయుప్రభిన్నామివ మేఘరేఖామ్. 26

సీతామపశ్యన్ మనుజేశ్వరస్య, రామస్య పత్నీం వదతాం వరస్య,
బభూవ దుఃఖాభిహతశ్చిరస్య ప్లవంగమో మంద ఇవాచిరస్య. 27

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే పంచమః సర్గః.*

---

ప్రవేశించియున్నది, ఉత్తమవనితలలో నెల్ల శ్రేష్ఠురా లయినది.... 24

రామవిరహమువలన కలిగిన తాపముచే పీడింపబడినది, పూర్వము శ్రేష్ఠమగు నిష్కమను ఆభరణమును కంఠమున ధరించినది, ఇప్పుడు ఎడతెగని కన్నీరే ఆభరణముగా గలది, సుందరములగు ఱెప్పవెండ్రుకలు కలది, చక్కని కంఠస్వరము కలది, వనమున నృత్యము చేయు నెమలి వలె నున్నదియు... 25

స్పష్టముగ అగపడని చంద్రరేఖ వలె నున్నది, (మిక్కిలి కృశించియుండుటకు, కాంతి తఱిగియుండుటకు ఇది దృష్టాంతము.) దుమ్ముచే కలుషితమైన బంగారు శలాకవలె నున్నది, (సహజముగ శుద్ధస్వభావము కలిగి ఆగంతుకమాలిన్యముతో కూడియుండుట కిది దృ.) బాణము లోన గుచ్చుకొని దానిని పెఱికివైచినపుడు లోపల నొక ముక్క చిక్కి, పైన మాత్రము మందులచే నొకింత మానిన గాయము వలె నున్నది, (అధికమైన అంతర్వేదన కిది దృ.) గాలిచే చెదరిన మేఘలేఖ వలె నున్నదియు (ఓదార్పరాని విధముగ శిథిలత నొందుట కిది దృ.). 26

మనుజేశ్వరుడు, భాషణకౌశలము కలవారిలో శ్రేష్ఠుడైన రాముని భార్యయగు సీతాదేవిని, చాల తడవు వెదకి, యామె కానరాక హనుమంతుడు తోడనే మూఢుని వలె దుఃఖితుడయ్యెను. 27

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమున అయిదవ సర్గము.*

# 6. షష్ఠః సర్గః

*(హనుమంతుడు రావణభవనమును చూచుట)*

స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్,
విచచార పున ర్లంకాం లాఘవేన సమన్వితః. 1

ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్,
ప్రాకారే ణార్కవర్ణేన భాస్వరే ణాభిసంవృతమ్. 2

రక్షితం రాక్షసై ర్ఘోరై స్సింహై రివ మహ ద్వనమ్,
సమీక్షమాణో భవనం చకాశే కపికుంజరః. 3

రూప్యకోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః,
విచిత్రాభిశ్చ కక్ష్యాభి ర్ద్వారైశ్చ రుచిరైర్వృతమ్. 4

---

తన కభిమతమగు రూపము ధరించగలవాడగు హనుమంతుడు విమానాకృతిగల రావణగృహములందు సీతను కానక, మిగుల దుఃఖించి, మఱియొకమారు వేగముగ సీతాన్వేషియై లంకలో తిరిగెను. 1

తిరిగి ధైర్యసంపన్నుడగు హనుమంతుడు సూర్యునివలె ఎఱ్ఱనై ప్రకాశించు ప్రాకారముచే పరివృతమైన రావణభవనము ప్రవేశించెను. 2

భీకరసింహములచే మహారణ్యము కాపాడబడినట్లు, భయంకరులగు రాక్షసులు కావలియున్న, సూర్యునివలె ప్రకాశించు రావణభవనమును చూచుచు, దాని కాంతులచే హనుమ ప్రకాశించెను. 3

వెండిచే నిర్మింపబడి, బంగారుతో నలంకరింపబడిన వివిధవరములు గల

గజాస్థితై ర్మహామాత్రై శ్శూరైశ్చ విగతశ్రమైః,
ఉపస్థిత మసంహార్యై ర్హయైః స్యందనయాయిభిః. 5
సింహవ్యాఘ్రతనుత్రాణై ర్దాంతకాంచనరాజతైః,
ఘోషవద్భి ర్విచిత్రైశ్చ సదా విచరితం రథైః. 6
బహురత్నసమాకీర్ణం పరార్ధ్యాసనభాజనమ్,
మహారథసమావాసం మహారథమహాసనమ్. 7
దృశ్యైశ్చ పరమోదారై స్తై స్తైశ్చ మృగపక్షిభిః,
వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమంతతః. 8
వినీతై రంతపాలైశ్చ రక్షోభిశ్చ సురక్షితమ్,
ముఖ్యాభిశ్చ వరస్త్రీభిః పరిపూర్ణం సమంతతః. 9
ముదితప్రమదారత్నం రాక్షసేంద్రనివేశనమ్,

---

ఏనుగుల నధిరోహించి తిరుగు ప్రధానులగు రాజపురుషులు, మహాకార్యమును గూడ శ్రమలేకయే అవలీలగ సాధించు శూరులును కలది, వధింపశక్యము గానివై, రథములకు పూన్చదగినవగు మేలి గుఱ్ఱములతో కూడినదియు... 5

సింహముల, పులుల చర్మములతో కప్పబడినవి, దంతములతో బంగారముతో వెండితో నిర్మింపబడినవి, యిటు నటు పోవుటచే శబ్దము చేయునవి, విచిత్రములైనవి అగు రథముల సంచారము కలదియు... 6

అనేకరత్నములతో కూడినదియు, శ్రేష్ఠములగు ఆసనములు, పాత్రలు కలదియు, మహారథులగు రాక్షసుల కావాసమైనదియు, శ్రేష్ఠరథములు ఉత్తమాసనములు కలదియు..7

సుందరములు, మహాకృతి గలవి, నానావిధములగు వేలాది మృగముల, పక్షుల సంచార మంతటను కలదియు.... 8

వరాభరణసంహ్రాదై స్సముద్రస్వననిస్వనమ్. 10
తద్రాజగుణసంపన్నం ముఖ్యై శ్చాగరుచందనైః,
మహాజనై స్సమాకీర్ణం సింహైరివ మహద్వనమ్. 11
భేరీమృదంగాభిరుతం శంఖఘోషనినాదితమ్,
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసై స్సదా. 12
సముద్రమివ గంభీరం సముద్రమివ నిస్స్వనమ్,
మహాత్మనో మహద్వేశ్మ మహారత్నపరిచ్ఛదమ్,
మహారత్నసమాకీర్ణం దదర్శ స మహాకపిః. 13
విరాజమానం వపుషా గజాశ్వరథసంకులమ్,
లంకాభరణ మిత్యేవ సోఽమన్యత మహాకపిః . 14

---

సంతోషముతో కూడిన శ్రేష్ఠవనితలు కలది, రాక్షసశ్రేష్ఠుల కావాసమైనది, ఉత్తమములగు ఆభరణముల మ్రోతలచే సముద్రమువలె ధ్వనించుచున్నదియు...10

ఛత్రచామరాది రాజలక్షణములు కలదియు, శ్రేష్ఠములగు అగరు, చందనాది లేపనద్రవ్యములు కలదియు, సింహములతో మహారణ్యము వలె గొప్పజనులతో కూడినదియు.... 11

భేరులు, మృదంగముల మ్రోత కలదియు, శంఖధ్వనితో మహాశబ్దము కలదియు, నిత్యము గంధపుష్పాదులతో నర్చించుట కలదియు, పర్వసమయములందు (రావణు డాహితాగ్ని యగుటచే) దర్శపూర్ణమాసాదిహోమము చేయుట కలదియు, రాజభవన మగుటచే సదా రాక్షసులచే నమస్కరింపబడునదియు... 12

సముద్రము వలె మిక్కిలి గంభీరమైనదియు, సవ్వడి లేని సముద్రమువలె ఉన్నదియు, మేలి మణుల కప్పుతో విలసిల్లుచు, మహారత్నమయమైనది యగు

చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః. 15

గృహాద్ గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః,
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. 16

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్,
తతోఽన్యత్ పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్. 17

అథ మేఘప్రతీకాశం కుంభకర్ణనివేశనమ్,
విభీషణస్య చ తదా పుప్లువే స మహాకపిః. 18

మహోదరస్య చ గృహం విరూపాక్షస్య చైవ హి,
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ . 19

వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః,
శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః. 20

---

యలంకారమని తలంచి, ఆ రావణుని భవనమునకు చేరువనే సీతను వెదకుచు తిరుగసాగెను. 14,15

రావణుని కుమారులు, మంత్రులు, మున్నగువారి గృహములలో నొకదాని పిమ్మట వేఱొకదానిని, వాని యుద్యానవనములను చూచుచు, హనుమంతుడు జంకు లేక యెల్లెడల సంచరించెను. 16

గొప్ప వేగము కలవాడు, పరాక్రమశాలి యగు హనుమ ప్రహస్తుని యింటికి పోయెను. అచటనుండి వెడలి మహాపార్శ్వుని భవనమునకు పోయెను. 17

పిమ్మట మహాకపి యగు హనుమంతుడు మేఘము వలె ఉన్నతమైన కుంభకర్ణుని యింటికి, విభీషణుని గృహమునకును పోయెను. 18

తథా చేంద్రజితో వేశ్మ జగామ హరియూథపః,
జంబుమాలే స్సుమాలేశ్చ జగామ హరిసత్తమః. 21
రశ్మికేతోశ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ .
వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః, 22
ధూమ్రాక్షస్య చ సంపాతే ర్భవనం మారుతాత్మజః.
విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్య చ. 23
శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్య చ,
బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 24
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య నాదినః,
విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ. 25
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి,
క్రమమాణః క్రమేణైవ హనుమాన్ మారుతాత్మజః. 26
తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః,
తేషా మృద్ధిమతా మృద్ధిం దదర్శ స మహాకపిః. 27

---

మహావానరుడు, వానరయూథపతి, వానరప్రముఖుడగు హనుమ అట్లు వెదకుచు, ఇంద్రజిత్తు, జంబుమాలి, సుమాలి, రశ్మికేతువు, సూర్యశత్రువు, వజ్రకాయుడను రాక్షస ప్రవరుల గృహములకు సీతను వెదుకబోయెను. 21,22

మహాకీర్తిశాలి హనుమంతు డచట ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాది, విద్యుజ్జిహ్వుడు, ఇంద్రజిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు అను సమృద్ధిశాలు రగు రాక్షసుల గృహములకు వరుసగా పోయి, ఆ యా రాక్షసుల వైభవోపేతములగు

సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమంతతః,
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్. 28

రావణ స్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః,
విచరన్ హరిశార్దూలో రాక్షసీ ర్వికృతేక్షణాః,
శూలముద్గరహస్తాశ్చ శక్తితోమరధారిణీః. 29

దదర్శ వివిధాన్ గుల్మాన్ తస్య రక్షఃపతే ర్గృహే. 30

రాక్షసాంశ్చ మహాకాయాన్ నానాప్రహరణోద్యతాన్,
రక్తాన్ శ్వేతాన్ సితాంశ్చైవ హరీంశ్చాపి మహాజవాన్. 31

కులీనాన్ రూపసంపన్నాన్ గజాన్ పరగజారుజాన్,
నిష్ఠితాన్ గజశిక్షాయా మైరావతసమాన్ యుధి. 32

---

తరువాత శ్రీమంతుడగు హనుమంతు డా రాక్షసుల భవనము లన్నింటిని దాటి తిరిగి రావణుని భవనమునకు పోయెను. 28

అచట తిరుగుచు నా హరిశ్రేష్ఠుడగు హనుమ రావణుడు నిద్రించు సమయమున మేల్కొని కావలియుండు రాక్షసస్త్రీలను చూచెను. వారు శూలములు, ముద్గరములు, శక్తులు, తోమరము లను నాయుధములు చేతులలో ధరించి యుండిరి. 29

అత డా రావణునింట కావలియున్న వివిధములగు సైన్యములను చూచెను. 30

అట్లు కావలియున్న రాక్షసులు పెనుమేను గలవారై, పలువిధములగు ఆయుధములు ధరించి యుండిరి. అచట ఎఱుపు, తెలుపు రంగు కలిగి, మహావేగము గల గుఱ్ఱములు కట్టివేయబడియుండెను. 31

అచట ఉత్తమమగు గజజాతులలో పుట్టినవి, చక్కని రూపము గలవి, శత్రు గజములను పీడించునవి, గజశిక్షలో సుశిక్షితములైనవి, యుద్ధమున ఐరావతమునకు [illegible] అగు ఏనుగు లుండెను. వర్షించు మేఘముల

నిహంతౄన్ పరసైన్యానాం గృహే తస్మిన్ దదర్శ సః,
క్షరతశ్చ యథా మేఘాన్ స్రవతశ్చ యథా గిరీన్. 33
మేఘస్తనితనిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః. 34
సహస్రం వాహినీ స్తత్ర జాంబూనదపరిష్కృతాః.
హేమజాలపరిచ్ఛన్నా స్తరుణాదిత్యసన్నిభాః,
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే. 35
శిబికా వివిధాకారాః స్స కపి ర్మారుతాత్మజః,
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణి చ . 36
క్రీడాగృహాణి చాన్యాని దారుపర్వతకానపి,
కామస్య గృహకం రమ్యం దివాగృహక మేవ చ,
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే. 37
స మందరగిరిప్రఖ్యం మయూరస్థానసంకులమ్,
ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్. 38

---

ఘీంకారము గలవి, యుద్ధమున శత్రువుల కెదిరింపరానివి అగు యేనుగుల నా రావణగృహమున హనుమ చూచెను. 32-34

హనుమంతు డా రావణగృహమున జంబూనదిలో పుట్టిన సువర్ణముతోడను, సాధారణమగు బంగారముతోడను చేయుబడిన ఆభరణములను ధరించి, బాలసూర్యునివలె భాసమానులైన వేయిమంది సైనికులను చూచెను. 35

వాయునందనుడగు హనుమంతుడు అనేకములగు ఆకృతులు గల పల్లకీలను, విచిత్రములగు లతాగృహములను, చిత్రశాలలను, క్రీడాభవనములను, కొయ్యతో

అనేకరత్నసంకీర్ణం నిధిజాలం సమంతతః.
ధీరనిష్ఠితకర్మాంతం గృహం భూతపతే రివ. 39

అర్చిర్భిశ్చాపి రత్నానాం తేజసా రావణస్య చ,
విరరాజాథ తద్వేశ్మ రశ్మిమానివ రశ్మిభిః. 40

జాంబూనదమయాన్యేవ శయనా న్యాసనాని చ,
భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః. 41

మధ్వాసవకృతక్లేదం మణిభాజనసంకులమ్,
మనోరమ మసంబాధం కుబేరభవనం యథా. 42

నూపురాణాం చ ఘోషేణ కాంచీనాం నినదేన చ,
మృదంగతలఘోషైశ్చ ఘోషవద్భి ర్వినాదితమ్. 43

---

గూడినది, జెండాలు కట్టిన కఱ్ఱలతో గూడినది యగు రావణుని ధనాగారము చూచెను. అది యనేకరత్నపరిపూర్ణమై అంతటను అనేకనిధులు కలదై, ధీరుడు కర్తవ్యనిష్ఠుడగు రావణుని పరాక్రమరూపమగు కర్మకు ఫలమైనట్టిదై, శివుని దివ్యభవనమువలె నుండెను. 38,39

రత్నకాంతులచేతను, రావణుని తేజస్సుచేతను, ఆ భవనము కిరణములచే సూర్యునివలె తేజరిల్లెను. 40

ఆ భవనమున హనుమ మంచములు, పీటలు, ప్రధానమగు పాత్రలు అన్నియు సువర్ణమయములై యుండుట చూచెను. 41

విశాలమైన ఆ భవనమున నేల తేనెతో చేయబడిన మద్యముతో తడిసియుండెను. మణిమయపాత్ర లంతటను ఉండెను. అది మనోహరమై విశాలమై కుబేరుని భవనమువలె ఉండెను. 42

మ్రోయుచున్న అందెల రవములతో, మొలత్రాళ్ళు చిరుగజ్జెల నాదముతో, మద్దెల మ్రోతలతో మహాధ్వని గలదియు, ప్రాసాదము లనేకములతో కూడినదియు, వందలాది

ప్రాసాదసంఘాతయుతం స్త్రీరత్నశతసంకులమ్,
సువ్యూఢకక్ష్యం హనుమాన్ ప్రవివేశ మహాగృహమ్. 44

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే షష్ఠః సర్గః.*

---

స్త్రీరత్నములతో వ్యాప్తమైనదియు, విశాలమగు కక్ష్యలు కలదియు అగు రావణుని ఆ మహాగృహమందు హనుమంతుడు ప్రవేశించెను. 43,44

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమున ఆరవ సర్గము సమాప్తము.*

# 7. సప్తమః సర్గః

*(హనుమ రావణుని గృహావైభవమును చూచుట)*

స వేశ్మజాలం బలవాన్ దదర్శ, వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్,
యథా మహత్ప్రావృషి మేఘజాలం, విద్యుత్పినద్ధం సవిహంగజాలమ్. 1
నివేశనానాం వివిధాశ్చ శాలాః, ప్రధానశంఖాయుధచాపశాలాః
మనోహరాశ్చాపి పునర్విశాలా, దదర్శ వేశ్మాద్రిషు చంద్రశాలాః.
గృహాణి నానావసురాజితాని, దేవాసురై శ్చాపి సుపూజితాని,
సర్వైశ్చ దోషైః పరివర్జితాని, కపిర్దదర్శ స్వబలార్జితాని. 3
తాని ప్రయత్నాభిసమాహితాని, మయేన సాక్షాదివ నిర్మితాని,
మహీతలే సర్వగుణోత్తరాణి, దదర్శ లంకాధిపతే ర్గృహాణి. 4

---

మహాబలవంతుడగు హనుమంతుడు వైడూర్యమణిఖచితము, సువర్ణమయమై, వివిధ పక్షిసమూహములతో కూడినదగుటచే వర్షాకాలమున మెఱుపులచే వ్యాప్తమై, పక్షులతో కూడిన మేఘసమూహమువలె నున్న భవనసముదాయమును చూచెను. 1

అందు పలువిధములగు గృహాంతశ్శాల లుండెను. అవి కొన్ని ముఖ్యములగు శంఖములు, తక్కిన ఆయుధములు, విండ్లను కలిగి యుండెను. మఱికొన్ని హర్మ్య, ప్రాసాదాదులందు సుందరములు, విశాలములగు పైమేడ లుండగా హనుమ చూచెను.

ఆ భవనము లనేకరత్నకాంతులతో ప్రకాశించుచుండెను. అవి దేవతలచే అసురులచే గూడ ప్రశంసింపబడి యుండెను. వానిని రాక్షసులు తమ బాహుబలముతో సంపాదించిరి. వానియం దే దోషమును కానరాకుండెను. 3

అవి కడుశ్రద్ధతో ప్రయత్నపూర్వకముగా చక్కగా మలచబడినవి. వానిని విశ్వకర్మయే నిర్మించినను, 'మయుడే వచ్చి స్వయముగా భూమిపై సర్వగుణాన్వితములుగా నిర్మించెనా' యనిపించుచుండును. అట్టి రావణగృహములను హనుమంతుడు చూచెను. 4

తతో దద ర్శోచ్ఛ్రితమేఘరూపం, మనోహరం కాంచనచారురూపమ్,
రక్షోధిప స్యాత్మబలానురూపం, గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్. 5
మహీతలే స్వర్గమివ ప్రకీర్ణం, శ్రియా జ్వలంతం బహురత్నకీర్ణమ్,
నానాతరూణాం కుసుమావకీర్ణం, గిరేరివాగ్రం రజసావకీర్ణమ్. 6
నారీప్రవేకై రివ దీప్యమానం, తటిద్భి రంభోదవ దర్శ్యమానమ్,
హంసప్రవేకై రివ వాహ్యమానం, శ్రియా యుతం ఖే సుకృతాం విమానమ్. 7
యథా నగాగ్రం బహుధాతుచిత్రం, యథా నభశ్చ గ్రహచంద్రచిత్రమ్,
దదర్శ యుక్తీకృతమేఘచిత్రం, విమానరత్నం బహురత్నచిత్రమ్. 8
మహీ కృతా పర్వతరాజిపూర్ణా, శైలాః కృతా వృక్షవితానపూర్ణాః,

---

పిమ్మట హనుమంతుడు మేఘమువలె ఉన్నతమైనది, మనోహరమైనది, బంగారముతో నిర్మితమగుటచే సుందరరూపము కలది, రావణుని బలమునకు సాటియైనది, సాటిలేని సౌందర్యము కలదగు శ్రేష్ఠగృహమును దర్శించెను. 5

ఆ రావణగృహము భూతలమునకు దిగివచ్చిన స్వర్గమువలె నుండెను. అనేక రత్నములతో కూడినదై కాంతులు వెదజల్లుచుండెను. నానావృక్షముల పూలతో వ్యాప్తమై పుప్పొడితో నిండిన కొండకొనవలె నుండెను. 6

అది మెఱుపుతీగలచే మేఘము వలె, సుందరనారీజనములతో ప్రకాశించుచు, ఎల్లరిచే శ్లాఘించబడుచు, అకాశమున శ్రేష్ఠములగు హంసలు మోయగా శోభిల్లు పుణ్యపురుషుల విమానము వలె వెలుగొందుచుండెను. 7

మఱియు వివిధరత్నములతో ఆశ్చర్యకరమై విలసిల్లు ఆ విమానరత్నము అనేక ధాతువులచే చిత్రింపబడిన పర్వతాగ్రమువలెను, గ్రహములచే చంద్రునిచే చిత్రమై యొప్పు ఆకాశమువలెను, ఒకచోట మబ్బులు గుమిగూడిన సుందరచిత్రములు కలది

వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః, పుష్పం కృతం కేసరపత్రపూర్ణమ్. 9

కృతాని వేశ్మాని చ పాండురాణి, తథా సుపుష్పాణ్యపి పుష్కరాణి,
పునశ్చ పద్మాని సకేసరాణి, ధన్యాని చిత్రాణి తథా వనాని. 10

పుష్పాహ్వయం నామ విరాజమానం, రత్నప్రభాభిశ్చ వివర్ధమానమ్,
వేశ్మోత్తమానా మపి చోచ్చమానం, మహాకపి స్తత్ర మహావిమానమ్. 11

కృతాశ్చ వైడూర్యమయా విహంగా, రూప్యప్రవాళైశ్చ తథా విహంగాః,
చిత్రాశ్చ నానావసుభిర్భుజంగా, జాత్యానురూపాస్తురగా శ్శుభాంగాః. 12

ప్రవాళజాంబూనదపుష్పపక్షా, స్సలీల మావర్జితజిహ్మపక్షాః,
కామస్య సాక్షాదివ భాంతి పక్షాః, కృతా విహంగాస్సుముఖా స్సుపక్షాః. 13

---

రేకులతో నిండినట్లుగను చిత్రింపబడి యుండెను. 9

అందు తెల్లని భవనములు, చక్కని పూలతో కూడిన కొలనులు, కింజల్కములతో గూడిన తామరలు, శ్రేష్ఠములై ఆశ్చర్యము కలిగించు వనములు చిత్రింపబడి యుండెను.

రత్నకాంతు లతిశయించుచుండగా వానిచే మిక్కిలి ప్రకాశించుచు, ఉత్తమభవనముల కంటె ఉన్నతమైన పుష్పక మను పేరు గల మహావిమానమును హనుమంతు డచట చూచెను. 11

ఆ విమానముపై కొన్ని పక్షులు వైడూర్యములచే నిర్మించబడెను. మఱికొన్ని వెండిచే, పగడములచే చేయబడెను. వివిధరత్నములచే వివిధవర్ణములగు సర్పములును, ఆ యా అశ్వజాతి స్పష్టమగునట్లు చక్కని అవయవములు గల గుఱ్ఱములును చిత్రింపబడెను. 12

అందు సుందరముఖములు, అందమైన ఱెక్కలుగల పక్షులు చిత్రింపబడియుండెను. వాని ఱెక్కలు విలాసముగ కొంచెము ముడుచుకొనుటచే వంకరగా నుండెను. వానిపై

నియుజ్యమానాస్తు గజాస్సుహస్తా, స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః
బభూవ దేవీ చ కృతా సుహస్తా, లక్ష్మీస్తథా పద్మిని పద్మహస్తా. 14

ఇతీవ తద్గృహమభిగమ్య శోభనం
సవిస్మయో నగమివ చారు శోభనమ్,
పునశ్చ తత్పరమసుగంధి సుందరం
హిమాత్యయే నగమివ చారుకందరమ్. 15

తతస్స తాం కపిరభిపత్య పూజితాం
చరన్ పురీం దశముఖబాహుపాలితామ్,
అదృశ్య తాం జనకసుతాం సుపూజితాం
సుదుఃఖితః పతిగుణవేగనిర్జితామ్. 16

---

ఆ విమానముపై తామరకొలను, అందు లక్ష్మీదేవి నభిషేకించుటకై స్వయముగ నుద్యుక్తములైన ఏనుగులు చిత్రింపబడియుండెను. వాని తొండములు సుందరములై యుండెను. అవి కలువపూలను తమ తొండములతో ధరించి యుండెను. వానితో బాటుగా ఆ కొలనులో సుందరహస్తములు కలదై, ఆ హస్తములందు కమలములు దాల్చి, ఏనుగులచే నభిషేకింపబడుచున్న లక్ష్మీదేవి ప్రకాశించుచు చిత్రింపబడియుండెను. 14

హనుమంతు డట్లు సుందరము, మంగళకరమై, పర్వతమువలె ఉన్నతమై ఉన్న రావణభవన మంతయును తిరిగి (ఎచ్చటను స్త్రీలతో గూడి రావణుడు కనుపించకుండుటచే) ఆశ్చర్యచకితుడై వసంతమునందు సుందరగుహలతో కూడిన పర్వతమువలె, ఆ భవన మద్భుతమై సుగంధభరితమై చూపట్టగా మరల నా

తతస్తదా బహువిధభావితాత్మనః,
కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః,
అపశ్యతోऽభవదతిదుఃఖితం మన,
స్సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః. 17

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే సప్తమః సర్గః.*

---

పలువిధములుగ నాలోచించువాడు, నిశ్చితబుద్ధి గలవాడు, సదాచారసంపన్నుడు, మహాత్ముడు, ఉత్తమమగు దర్శనశక్తి గలవాడగు హనుమంతుని మనస్సు సీతాదేవిని చూడక మిక్కిలి చింతాక్రాంతమయ్యెను. 17

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమందు ఏడవ సర్గము సమాప్తము.*

# 8. అష్టమః సర్గః

*(హనుమంతుడు పుష్పకవిమానమును చూచుట)*

స తస్య మధ్యే భవనస్య సంస్థితం, మహద్విమానం మణివజ్రచిత్రితమ్,
ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం, దదర్శ వీరః పవనాత్మజః కపిః. 1

త దప్రమేయాప్రతికారకృత్రిమం, కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా,
దివం గతం వాయుపథప్రతిష్ఠితం, వ్యరాజతాऽऽదిత్యపథస్య లక్ష్మవత్. 2

న తత్ర కించి న్న కృతం ప్రయత్నతో, న తత్ర కించి న్న మహార్హరత్నవత్,
న తే విశేషా నియతా స్సురేష్వపి, న తత్ర కించిన్న మహావిశేషవత్. 3

తపస్సమాధానపరాక్రమార్జితం, మనస్సమాధానవిచారచారిణమ్,

---

వీరుడగు హనుమంతు డ ట్లా భవనము నడుమ పెద్ద విమానమును చూచెను. అది మణులతో, వజ్రములతో చిత్రింపబడి యుండెను. దాని గవాక్షములు మేలిమి బంగారముతో నిర్మించబడి యుండెను. 1

ఆ విమానసౌందర్య మిట్టిదని తెలుప నలవికాదు. అట్టిది వేఱొకటి నిర్మించుటకును సాధ్యము కాదు. విశ్వకర్మ స్వయముగ దానిని రూపొందించి దాని నిర్మాణమును ప్రశంసించెను. అది భూమికి సన్నిహితమగు వాయుమార్గమైన అంతరిక్షమున నున్నదై సూర్యుని గమనమార్గమును సూచించుచు ప్రకాశించుచుండెను. 2

ఆ విమానమున ప్రయత్నపూర్వకముగ నిర్మింపబడని భాగమే లేదు. అమూల్య

అనేకసంస్థానవిశేషనిర్మితం, తత స్తతస్తుల్యవిశేషదర్శనమ్. 4

మన స్సమాధాయ తు శీఘ్రగామినం,
దురావరం మారుతతుల్యగామినమ్,
మహాత్మనాం పుణ్యకృతాం మహర్ధినాం,
యశస్వినా మగ్ర్యముదా మివాలయమ్. 5

విశేష మాలంబ్య విశేషసంస్థితం, విచిత్రకూటం బహుకూటమండితమ్,
మనోభిరామం శరదిందునిర్మలం, విచిత్రకూటం శిఖరం గిరే ర్యథా. 6

వహంతి యం కుండలశోభితాననా, మహాశనా వ్యోమచరా నిశాచరాః,
వివృత్తవిధ్వస్తవిశాలలోచనా, మహాజవా భూతగణాస్సహస్రశః. 7

---

గుణముగ ఏ ప్రదేశమునకైన పోవునది, అనేక విమాన గోపురాది సన్నివేశములతో నిర్మింపబడినది, అట నట సర్వతోరమణీయమగు విశేషదర్శనము కలది యగు పుష్పక విమానమును హనుమ దర్శించెను. 4

ఆ విమానము స్వామిచిత్తమును మదిలో నిలుపుకొని శీఘ్రముగా పోవునదియు, అన్యులకు దుర్లభమైనదియు, వాయువేగము కలదియు అయి, మహాత్ములు, పుణ్యవంతులు, మహాధనవంతులు, కీర్తిశాలురు, మహానందము కలవారగు ఇంద్రాదుల నివాసమువలె నుండెను. 5

విశిష్టములగు రత్నాదిసమూహములచే దివ్యమగు సంస్థానవిశేషము కలదై, అనేక శిఖరములు విచిత్రములగు అవాంతరశిఖరములు కలదై, మనోహరమై, శరత్కాల

వసంతపుష్పోత్కరచారుదర్శనం, వసంతమాసాదపి కాంతదర్శనమ్,
స పుష్పకం తత్ర విమానముత్తమం, దదర్శ తద్వానరవీరసత్తమః. 8

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే అష్టమః సర్గః.*

---

ఇట్లు వానరవీరులలో శ్రేష్ఠుడగు హనుమంతుడు వసంతకాలపు పుష్పసమూహము వలె సుందరమై కనుపించునది, వసంతమాసము కంటెను మనోహరదర్శనము కలది, శ్రేష్ఠమైనది అగు పుష్పకవిమానమును చూచెను. 8

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమం దెనిమిదవ సర్గము సమాప్తము.*

# 9. నవమః సర్గః

*(హనుమంతుడు రావణాంతఃపురము దర్శించుట)*

తస్యాలయవరిష్ఠస్య మధ్యే విపుల మాయతమ్,
దదర్శ భవనశ్రేష్ఠం హనుమాన్ మారుతాత్మజః. 1
అర్ధయోజనవిస్తీర్ణ మాయతం యోజనం హి తత్,
భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాదసంకులమ్. 2
మార్గమాణస్తు వైదేహీం సీతా మాయతలోచనామ్,
సర్వతః పరిచక్రామ హనుమా నరిసూదనః. 3
ఉత్తమం రాక్షసావాసం హనుమా నవలోకయన్,
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్. 4
చతుర్విషాణైర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవ చ,

---

అట్లు వాయుపుత్రుడగు హనుమంతుడు రావణుని నివాసమగు మహాభవనము నడుమ విశాలమగు ఉత్తమభవనమును చూచెను. 1

రాక్షసరాజగు రావణుని యా భవనము అర యామడ వెడలుపు, ఆమడ పొడవు గలదై యనేకములగు మేడలు కలిగి యుండెను. 2

శత్రువులను నాశము చేయువాడగు హనుమంతుడు విశాలనేత్రి అగు సీతాదేవిని వెదకుచు చుట్టుపక్కలనున్న రావణుని సోదరులు, కుమారులు, మంత్రులు మున్నగు వారి భవనములం దెల్ల తిరిగెను. 3

శ్రీమంతుడగు హనుమంతుడు రాక్షసుల శ్రేష్ఠములగు నివాసముల నెల్ల చూచుచు ఆ నివాసములకు నెలవైన రావణుని భవనమును చేరెను. 4

విస్తృతమైన ఆ భవనము చుట్టును నాలుగు దంతములు, మూడు దంతములు

పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణ ముదాయుధైః.
రాక్షసీభిశ్చ పత్నీభీ రావణస్య నివేశనమ్, 5
ఆహృతాభిశ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్.
తన్నక్రమకరాకీర్ణం తిమింగిలఝషాకులమ్, 6
వాయువేగసమాధూతం పన్నగైరివ సాగరమ్.
యా హి వైశ్రవణే లక్ష్మీ ర్యా చేంద్రే హరివాహనే, 7
సా రావణగృహే సర్వా నిత్యమే వానపాయినీ.
యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ, 8
తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధీ రక్షోగృహే ష్విహ. 9
తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్యత్ సునిర్మితమ్,

---

గల ఏనుగులు యుండెను. ఆయుధములు దాల్చి రాక్షసులు దానిని కాపాడుచుండిరి. 5

ఆ భవనమందు రావణుని రాక్షసజాతి భార్యలు, పరాక్రమించి అతడు చెరపట్టి తెచ్చిన రాజకన్యలు నుండిరి. 6

ఇట్లాయుధపాణులగు పురుషులు, స్త్రీలతో కూడి ఆ ప్రాసాదము మొసళ్ళు, పెనుమీలచే వ్యాప్తమై, తిమింగిలములు, చేపలచే కలచి వేయబడి వాయువేగముచే కల్లోలితమై పాములతో కూడినట్టి సముద్రము వలె నుండెను. 7

కుబేరునికిని, పచ్చని గుఱ్ఱములు కల దేవేంద్రునికిని ఏ సంపదయున్నదో (తక్కిన దిక్పతులకును ఇది యుపలక్షణము) ఆ సంపదయంతయు నిత్య మెడతెగక రావణుని ఆ గృహమం దుండెను. 8

కుబేరునికి, యమునకు, వరుణునకు ఎట్టి సమృద్ధి కలదో అట్టిది

బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః. 10
బ్రహ్మణోఽర్థే కృతం దివ్యం దివి య ద్విశ్వకర్మణా,
విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్. 11
పరేణ తపసా లేభే యత్ కుబేరః పితామహాత్,
కుబేర మోజసా జిత్వా లేభే తద్రాక్షసేశ్వరః. 12
ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః,
సుకృతై రాచితం స్తంభైః ప్రదీప్తమివ చ శ్రియా. 13
మేరుమందరసంకాశై రుల్లిఖద్భి రివాంబరమ్,
కూటాగారై శ్శుభాకారై స్సర్వత స్సమలంకృతమ్. 14
జ్వలనార్కప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా,
హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్. 15

---

కూడి, చక్కగా నిర్మింపబడిన పుష్పకవిమానమును హనుమంతుడు మఱల చూచెను. 10

శ్రేష్ఠము, సర్వరత్నవిభూషితమగు ఆ పుష్పక మను విమానమును స్వర్గమున విశ్వకర్మ బ్రహ్మకై నిర్మించెను. కుబేరుడు తీవ్రతప మొనర్చి, దానిని బ్రహ్మనుండి సంపాదించెను. కుబేరుని తన పరాక్రమముచే జయించి రావణుడు దానిని చేజిక్కించుకొనెను. 11,12

ఆ పుష్పకము బంగారు, వెండితో నిర్మింపబడి తోడేళ్ళ చిత్రములు గల సుందర స్తంభములతో కూడి మిక్కిలి శోభిల్లుచు, మేరు, మందర పర్వతములవలె ఉన్నతమై, నింగిని తాకుచున్నదో యనిపించుచు అంతటను సుందరములగు మేడలతో కూడియుండెను. 13,14

అగ్నివలెను సూర్యునివలెను శోభిల్లు ఆ భవనమును విశ్వకర్మ మిక్కిలి కౌశలముతో నిర్మించెను. అది బంగారుమెట్లు, ఉత్తమవేదికలతో శోభిలుచుండెను. దాని గోడలపై

జాలవాతాయనై ర్యుక్తం కాంచనైః స్ఫాటికైరపి,
ఇంద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్. 16

విద్రుమేణ విచిత్రేణ మణిభిశ్చ మహాధనైః,
నిస్తులాభిశ్చ ముక్తాభి స్తలే నాభివిరాజితమ్. 17

చందనేన చ రక్తేన తపనీయనిభేన చ,
సుపుణ్యగంధినా యుక్త మాదిత్యతరుణోపమమ్. 18

కూటాగారై ర్వరాకారై ర్వివిధై స్సమలంకృతమ్,
విమానం పుష్పకం దివ్య మారురోహ మహాకపిః. 19

తత్రస్థ స్స తదా గంధం పానభక్ష్యాన్నసంభవమ్,
దివ్యం సమ్మూర్ఛితం జిఘ్రు ద్రూపవంత మివానిలమ్. 20

స గంధస్తం మహాసత్త్వం బంధు ర్బంధుమివోత్తమమ్,
ఇత ఏహీ త్యువాచేవ తత్ర యత్ర స రావణః. 21

---

జాలములు (కిటికీలు)ను, ఇంద్రనీల మహానీల (సింహళద్వీపమున పుట్టిన నీలము) మణిఖచితవేదికలు నుండెను. విచిత్రములైన పగడములు, మహామూల్యములగు మణులు, సాటిలేని గుండ్రని ముత్యములు నేలమాళిగపై తాపబడి యా భవనము ప్రకాశించుచుండెను. బంగారమువలె తేజరిల్లు రక్తచందనము సుగంధమును గుబాళించుచుండగా ఆ భవనము బాలభానుని పగిది భాసిల్లుచుండెను. ఇట్టి నానావిధ భవన సముదాయముచే నలంకరింపబడియున్న దివ్యమగు పుష్పకవిమానమును మహాకపి మారుతి యధిరోహించెను. 15-19

హనుమంతు డా భవనముపై నిలచి మద్యములు, పిండివంటలు, అన్నములనుండి [illegible] దివ్యగంధము నాఘ్రాణించెను. 20

తత స్తాం ప్రస్థిత శ్శాలాం దదర్శ మహతీం శుభామ్,
రావణస్య మనఃకాంతాం కాంతామివ వరస్త్రియమ్. 22

మణిసోపానవికృతాం హేమజాలవిభూషితామ్,
స్ఫాటికై రావృతతలాం దంతాంతరితరూపికామ్. 23

ముక్తాభిశ్చ ప్రవాళైశ్చ రూప్యచామీకరై రపి,
విభూషితాం మణిస్తంభై స్సుబహుస్తంభభూషితామ్. 24

సమై ర్ఋజుభి రత్యుచ్చై స్సమంతాత్ సువిభూషితైః,
స్తంభైః పక్షై రివాత్యుచ్చై ర్దివం సంప్రస్థితామివ. 25

మహత్యా కుథయాస్తీర్ణాం పృథివీలక్షణాంకయా,
పృథివీమివ విస్తీర్ణాం సరాష్ట్రగృహమాలినీమ్. 26

నాదితాం మత్తవిహగై ర్దివ్యగంధాధివాసితామ్,

---

హనుమంతు డట్లు బయలుదేరి రావణుని హృదయమునకు ప్రీతిని గూర్చు శ్రేష్ఠతరుణి వలె విలసిల్లుచున్న మంగళకరము, విశాలమగు భవనమును చూచెను. 22

అందలి మెట్లు మణులు పొదుగబడియుండెను. కిటికీలు బంగారుతో చేయబడెను. నేల స్ఫటికమణిఖచితమై యుండెను. బొమ్మలు గజదంతముతో నిర్మింపబడియుండెను. మణిస్తంభములు ముత్యములు, పగడములు, వెండి, బంగారముతో నిర్మింపబడెను. ఇట్లు సమములు, వంకరలేనివి, అలంకరింపబడినవి, మిక్కిలి ఎత్తైనవగు అనేక స్తంభములతో ఉన్నతమైన ఆ భవనము ఱెక్కలతో నాకాశమున కెగుర సమకట్టినది వలె నుండెను. 23-25

ఆ భవనము నదులు, సముద్రములు, కొండలు, రాష్ట్రములు మున్నగు పృథివీలక్షణములు చక్కగా నగపడునట్లు చిత్రింపబడిన చిత్రకంబళముచే కప్పబడిన

పరార్థ్యాస్తరణోపేతాం రక్షోధిపనిషేవితామ్. 27

ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాండురామ్,

చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీమివ సుప్రభామ్. 28

మనస్సంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాధినీమ్,

తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీమివ. 29

ఇంద్రియా ణీంద్రియార్థై స్తు పంచ పంచభి రుత్తమైః,

తర్పయామాస మాతేవ తదా రావణపాలితా. 30

స్వర్గోఽయం దేవలోకోఽయ మింద్రస్యేయం పురీ భవేత్,

సిద్ధి ర్వేయం పరా హి స్యా దిత్యమన్యత మారుతిః. 31

ప్రధ్యాయత ఇవాపశ్యత్ ప్రదీప్తాం స్తత్ర కాంచనాన్,

---

దివ్యగంధము గుబాళించుచుండెను. వెలలేని తివాచీలు భూతలముపై పఱచబడెను. 27

ఆ భవనము స్వచ్ఛమై హంసవలె తెల్లనిదైనను అగరుధూపముచే బూడిదరంగు కలదివలె నుండెను. వివిధవర్ణములు గల పుష్పాలంకారములచే వసిష్ఠుని నందినీధేనువువలె కాంతిమంతమై యుండెను. 28

ఆ గృహము చూపరుల మనస్సుల కానందము కలిగించుచు వారి ముఖవర్ణమును తన ప్రకాశముచే మఱింతగా కాంతిమంతము చేసి, శోకము పోగొట్టుచు శ్రేష్ఠమై సిరిసంపదలకు పుట్టినిల్లువలె నుండెను. 29

ధూర్తానివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్. 32
దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ,
అర్చిర్భి ర్భూషణానాం చ ప్రదీప్తే త్యభ్యమన్యత. 33
తతోఽపశ్యత్ కుథాసీనం నానావర్ణాంబరస్రజమ్,
సహస్రం వరనారీణాం నానావేషవిభూషితమ్. 34
పరివృత్తేఽర్ధరాత్రే తు పాననిద్రావశం గతమ్,
క్రీడిత్వోపరతం రాత్రౌ సుష్వాప బలవత్తదా. 35
తత్ ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాంతరభూషణమ్,
నిశ్శబ్దహంసభ్రమరం యథా పద్మవనం మహత్. 36
తాసాం సంవృతదంతాని మీలితాక్షాణి మారుతిః,
అపశ్యత్ పద్మగంధీని వదనాని సుయోషితామ్. 37

---

చూచెను. అవి కుశలురగు జూదగాండ్రచే జూదమున నోడి ఏమియు తోచక నిశ్చేష్టులైన జూదరుల వలె నుండెను. 32

దీపముల కాంతి, రావణుని తేజము, ఆభరణముల ప్రకాశములు అంతటను వ్యాపించగా "ఈ శాల తగులబడుచున్నదా ఏమి" యని హనుమంతుడు తలంచెను. 33

అంత హనుమ వివిధవరములు గల వస్త్రములు, మాలలు దాల్చి నానా వేషములతో

ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే,
పున స్సంవృతపత్రాణి రాత్రావివ బభు స్తదా. 38

ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః,
అంబుజానీవ ఫుల్లాని ప్రార్థయంతి పునః పునః. 39

ఇతి చామన్యత శ్రీమా నుపపత్త్యా మహాకపిః,
మేనే హి గుణత స్తాని సమాని సలిలోద్భవైః. 40

సా తస్య శుశుభే శాలా తాభిః స్త్రీభి ర్విరాజితా,
శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా. 41

స చ తాభిః పరివృత శ్శుశుభే రాక్షసాధిపః,
యథా హ్యుడుపతిః శ్రీమాం స్తారాభి రభిసంవృతః. 42

యా శ్చ్యవంతేఽంబరా త్తారాః పుణ్యశేషసమావృతాః,

---

వారి ముఖములు ఉదయము పద్మములవలె వికాసము పొంది, రాత్రి తిరిగి రేకులు ముడుచుకొన్న పద్మముల వలె ప్రకాశించెను. 38

'తుమ్మెద లీ ముఖపద్మములను గాంచి వికసించిన పద్మములని భ్రమించి మకరందమం దాశతో వీనిపై మాటిమాటికి తప్పక వ్రాలగలవు' అని హనుమంతుడు సయుక్తికముగ తలంచెను. సౌందర్య సౌగంధ్యాదిగుణములచే వారి ముఖములు పద్మములకు సాటి యని తలంచెను. 39,40

రావణుని భవన మా స్త్రీలతో విరాజిలుచు. నక్షత్రములతో శోభిలు శరత్కాలపు

ఇమాస్తా స్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరి స్తదా. 43
తారాణామివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్,
ప్రభావర్ణప్రసాదాశ్చ విరేజు స్తత్ర యోషితామ్. 44
వ్యావృత్తగురుపీనస్రక్ ప్రకీర్ణవరభూషణాః,
పానవ్యాయామకాలేషు నిద్రాపహృతచేతసః. 45
వ్యావృత్తతిలకాః కాశ్చిత్ కాశ్చి దుద్భ్రాంతనూపురాః,
పార్శ్వే గళితహారాశ్చ కాశ్చిత్ పరమయోషితః. 46
ముక్తాహారావృతా శ్చాన్యాః కాశ్చి ద్విస్రస్తవాససః,
వ్యావిద్ధరశనాదామాః కిశోర్య ఇవ వాహితాః. 47
సుకుండలధరా శ్చాన్యా విచ్ఛిన్నమృదితస్రజః,

---

హనుమంతుడు తలంచెను. 43

(ఏలననగా) అచట ఆ యువతుల కాంతి, వర్ణము, ప్రసన్నత యను నీ మూడును, సుందరమగు కాంతిగల శ్రేష్ఠములగు నక్షత్రముల కాంతి, వర్ణము, నిర్మలతవలె నుండెను. 44

మధుపానమునకు పిమ్మట రతికేళియందు (లేదా నృత్య, గీత, క్రీడాదులయందు) తాము ధరించిన పెద్ద పెద్ద పుష్పమాలలు స్థానము తప్పి, యాభరణములు చెదరి యుండగా ఆ యంగన లట్లే ఒడలు మఱచి నిదురింపసాగిరి. 45

వారిలో కొందరు దరించిన తిలకము తొలగి యుండెను. కొందరి అందెల

గజేంద్రమృదితాః ఫుల్లా లతా ఇవ మహావనే. 48

చంద్రాంశుకిరణాభాశ్చ హారాః కాసాంచి దుత్కటాః,
హంసా ఇవ బభు స్సుప్తాః స్తనమధ్యేషు యోషితామ్. 49

అపరాసాం చ వైడూర్యాః కాదంబా ఇవ పక్షిణః,
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇవాభవన్. 50

హంసకారండవాకీర్ణా శ్చక్రవాకోపశోభితాః,
ఆపగా ఇవ తా రేజు ర్జఘనైః పులినైరివ. 51

కింకిణీజాలసంకోశా స్తా హైమవిపులాంబుజాః,
భావగ్రాహా యశస్తీరా స్సుప్తా నద్య ఇవాబభుః. 52

మృదుష్వంగేషు కాసాంచిత్ కుచాగ్రేషు చ సంస్థితాః,

---

దారము తెగి నలిగియుండెను. వా రా మాలలతో మహారణ్యమున గజశ్రేష్ఠము తొక్కివేసిన పూతీగలవలె నుండిరి. 48

కొందరు స్త్రీలు స్తనములనడుమ దాల్చిన లావైన ముత్యాలమాలలు చంద్రకిరణముల వలె తెల్లని కాంతిగలవై నిదురించిన హంసలవలె నుండెను. 49

కొందరు స్తనమధ్యప్రదేశమున దాల్చిన పగడములు కాదంబపక్షులవలెను, మఱికొందఱు ధరించిన స్వర్ణహారములు చక్రవాకపక్షులవలెను చూపట్టెను. 50

విశాలమగు పిరుదులు గల ఆ స్త్రీలు నిద్రావస్థలో మునిగి హంసలు,

బభూవు ర్భూషణానీవ శుభా భూషణరాజయః. 53
అంశుకాంతాశ్చ కాసాంచి న్ముఖమారుతకంపితాః,
ఉపర్యుపరి వక్త్రాణాం వ్యాధూయంతే పునః పునః. 54
తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః,
నానావర్ణసువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే. 55
వవల్గు శ్చాత్ర కాసాంచిత్ కుండలాని శుభార్చిషామ్,
ముఖమారుతసంసర్గా న్మందం మందం సుయోషితామ్. 56
శర్కరాసవగంధై శ్చ ప్రకృత్యా సురభి స్సుఖః,
తాసాం వదననిశ్వాసః సిషేవే రావణం తదా. 57
రావణాననశంకాశ్చ కాశ్చి ద్రావణయోషితః,
ముఖాని స్మ సపత్నీనాముపాజిఘ్రన్ పునః పునః. 58

---

యంగములపై శుభములగు ఆభరణముల ముద్రలు చెఱుగక ఆభరణములవలెనే ప్రకాశించినవి. 53

వారు ముఖముపై కప్పుకొనిన సూక్ష్మములగు వస్త్రముల కొనలు వారి నిశ్వాస వాయువులచే కదలుచు మాటిమాటికి ముఖముపై పడుచుండెను. 54

ఆ రావణభార్యల నిశ్వాసవాయువు కారణముగా వారు ధరించిన సుందరవస్త్రముల కొనలు వివిధవర్ణములచే కాంతి మంతములై కదలుచు జెండాలవలె ప్రకాశించినవి. 55

అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః,
అస్వతంత్రాః సపత్నీనాం ప్రియ మేవాచరం స్తదా. 59

బాహూ నుపనిధా యాన్యాః పారిహార్యవిభూషితాన్,
అంశుకాని చ రమ్యాణి ప్రమదా స్తత్ర శిశ్యిరే. 60

అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చిత్ పునర్భుజమ్,
అపరా త్వంక మన్యస్యా స్తస్యా శ్చాప్యపరా భుజౌ. 61

ఊరుపార్శ్వకటీపృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః,
పరస్పరనివిష్టాంగ్యో మదస్నేహవశానుగాః. 62

అన్యోన్యభుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా,
మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత్తషట్పదా. 63

---

రావణునియందు మిక్కిలి మక్కువ గల ఆ సుందరాంగనలు, రాగాంధలై, తమ ముఖమును రావణుని ముఖమని భ్రమించి లిఘ్రాణించు తమ సవతులపై కోపింపక వారికి ప్రియమే చేకూర్చిరి. 59

కొందరు స్త్రీలు కడియము తొడిగిన తమ భుజములను, సుందరములగు నూకు

లతానాం మాధవే మాసి ఫుల్లనాం వాయుసేవనాత్,
అన్యోన్యమాలాగ్రథితం సంసక్తకుసుమోచ్చయమ్. 64
వ్యతివేష్టితసుస్కంధ మన్యోన్యభ్రమరాకులమ్,
ఆసీ ద్వనమివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్. 65
ఉచితేష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా,
వివేక శ్శక్య ఆధాతుం భూషణాంగాంబరస్రజామ్. 66
రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః,
జ్వలంతః కాంచనా దీపాః ప్రైక్షం తానిమిషా ఇవ. 67

---

వసంతుర్తువునందు మలయానిలసంచారముచే పుష్పించిన లతావన మెట్లు కంపించునో, అట్లే ముఖవాయుసంచారముచే తాము ధరించిన చీరల కొంగులు కదలుచుండగా, రావణస్త్రీసమూహము కూడ కదలినట్లుండెను. ఎట్లు తీగలన్నియు

రాజర్షిపితృదైత్యానాం గంధర్వాణాం చ యోషితః,
రాక్షసానాం చ యాః కన్యాస్తస్య కామవశం గతాః. 68
యుద్ధకామేన తాస్సర్వా రావణేన హృతాః స్త్రియః,
సమదా మదనేనైవ మోహితాః కాశ్చి దాగతాః. 69
న తత్ర కాచిత్ ప్రమదా ప్రసహ్య, వీర్యోపపన్నేన గుణేన లబ్ధా,
న చాన్యకామాపి న చాన్యపూర్వా, వినా వరార్హాం జనకాత్మజాం తామ్. 70
న చాకులీనా న చ హీనరూపా, నాదక్షిణా నానుపచారయుక్తా,
భార్యాఽభవత్తస్య న హీనసత్త్వా, న చాపి కాంతస్య న కామనీయా. 71
బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య, [1]యదీదృశీ రాఘవధర్మపత్నీ,

---

రాజర్షుల స్త్రీలు, పితరుల వనితలు, దైత్యాంగనలు, గంధర్వకాంతలు, రాక్షసకన్యలు అందరును రావణుని కామించి, యతనికి వశపడిరి. 68

ఇమా యథా రాక్షసరాజభార్యాః, సుజాతమస్యేతి హి సాధుబుద్ధేః. 72
పునశ్చ సోఽ చింతయదార్తరూపో, ధ్రువం విశిష్టా గుణతో హి సీతా,
అథాయమస్యాం కృతవాన్ మహాత్మా, లంకేశ్వరః కష్ట మనార్యకర్మ. 73

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే నవమః సర్గః.*

---

డెట్లు తన కాంతల నెడబాయకున్నాడో అట్లే సీతయు రాము నెడబాయకుండునట్లు ఆమెను రావణుడు రామున కర్పించునో రావణుని సంపద అవిచ్ఛిన్నమై యుండును కదా' అని తలంచెను. 72

అనంతరము, "సీతాదేవి పాతివ్రత్యగుణవిశిష్టురాలు. గొప్ప కులమున బుట్టియు, ఈ రావణుడు సీతాపహరణ మను నీచకార్యమున కొడిగట్టినాడు. ఎంత కష్టము" అని తలచి " సీతాదేవి ధృఢవ్రత కావున ఆమె పాతివ్రత్యమున కెట్టి భంగమును కలుగదు. కనుక రావణు డామెను తెచ్చి దుష్కృత్యమే చేయుచున్నా డని మిక్కిలి దుః ఖించెను. 73

*ఇట్లు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణమున*
*సుందరకాండమున తొమ్మిదవ సర్గము.*

# 10. దశమః సర్గః

*(హనుమంతుడు మండోదరిని చూచుట)*

తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్,
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్. 1

దాంతకాంచనచిత్రాంగై ర్వైడూర్యైశ్చ వరాసనైః,
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః. 2

తస్య చైకతమే దేశే సోఽగ్ర్యమాలావిభూషితమ్,
దదర్శ పాండురం ఛత్రం తారాధిపతిసన్నిభమ్. 3

జాతరూపపరిక్షిప్తం చిత్రభానుసమప్రభమ్,
అశోకమాలావితతం దదర్శ పరమాసనమ్. 4

---

హనుమంతు డట్లు రావణుని అంతఃపురమును పరిశీలించుచు, అతడు శయనించు పర్యంక (మంచ)మును చూచెను. స్ఫటికములు, రత్నములు పొదిగిన ఆ శయనము

వాలవ్యజనహస్తాభి ర్వీజ్యమానం సమంతతః,
గంధైశ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్. 5
పరమాస్తరణాస్తీర్ణ మావికాజినసంవృతమ్,
దామభి ర్వరమాల్యానాం సమంతా దుపశోభితమ్. 6
తస్మిన్ జీమూతసంకాశం ప్రదీప్తోత్తమకుండలమ్,
లోహితాక్షం మహాబాహుం మహారజతవాససమ్. 7
లోహితే నానులిప్తాంగం చందనేన సుగంధినా,
సంధ్యారక్త మివాకాశే తోయదం సతటిద్గణమ్. 8
వృత మాభరణై ర్దివ్యైః సురూపం కామరూపిణమ్,
సవృక్షవనగుల్మాఢ్యం ప్రసుప్తమివ మందరమ్. 9
క్రీడి త్వోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్,
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్. 10

---

స్త్రీలు ఆ శయనమునకు నలువైపులను నిలచి, వింజామరలు చేపట్టి విసరుచుండిరి.

పీత్వాఽప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః,
భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్. 11

నిఃశ్వసంతం యథా నాగం రావణం వానరర్షభః,
ఆసాద్య పరమోద్విగ్నః సోఽపాసర్పత్ సుభీతవత్. 12

అథాఽఽరోహణ మాసాద్య వేదికాంతర మాశ్రితః,
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః. 13

శుశుభే రాక్షసేంద్రస్య స్వపత శ్శయనోత్తమమ్,
గంధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్. 14

కాంచనాంగదనద్ధౌ చ దదర్శ స మహాత్మనః,

---

నుండెను. సుందరుడు, కామరూపి అగు అతడు దివ్యాభరణములు ధరించి, చెట్లు, తోటలు, పొదలతో కూడినదై (సముద్రమథనమునకు పిమ్మట) నిశ్చలమైయున్న మందరపర్వతమువలె, లోకమును పలుమార్లు కలచివైచి, ఒడలు మరచి నిదురించుచుండెను. 7-11

బుసకొట్టు సర్పమువలె నిశ్వసించుచున్న రావణుని చెంతకు చేరి హనుమంతుడు

విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజా వింద్రధ్వజోపమౌ. 15

ఐరావతవిషాణాగ్రై రాపీడనకృతవ్రణౌ,

వజ్రోల్లిఖితపీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ. 16

పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ,

సులక్షణనఖాంగుష్ఠౌ స్వంగులీతలలక్షితౌ. 17

సంగతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ,

విక్షిప్తౌ శయనే శుభ్రే పంచశీర్షా వివోరగౌ. 18

శశక్షతజకల్పేన సుశీతేన సుగంధినా,

చందనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలంకృతౌ. 19

ఉత్తమస్త్రీవిమృదితౌ గంధోత్తమనిషేవితౌ,

యక్షపన్నగగంధర్వదేవదానవరావిణౌ. 20

దదర్శ స కపి స్తస్య బాహూ శయనసంస్థితౌ,

---

ఇంద్రధ్వజములవలె నుండెను. ఐరావతముతో పూర్వము పోరాడినపు డేర్పడిన

... గాటు వానిపై ప్రకాశించుచుండెను.

మందర స్యాంతరే సుప్తౌ మహాహీ రుషితావివ. 21

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః,
శుశుభేఽచలసంకాశః శృంగాభ్యామివ మందరః. 22

చూతపున్నాగసురభి ర్వకుళోత్తమసంయుతః,
మృష్టాన్నరససంయుక్తః పానగంధపురస్సరః. 23

తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహాముఖాత్,
శయానస్య వినిశ్వాసః పూరయన్నివ తద్గృహమ్. 24

ముక్తామణివిచిత్రేణ కాంచనేన విరాజితమ్,
మకుటే నాపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్. 25

రక్తచందనదిగ్ధేన తథా హారేణ శోభినా,
పీనాయతవిశాలేన వక్షసాఽభివిరాజితమ్. 26

---

దానవులను యుద్ధమున పీడించునవై మందరపర్వతము నడుమ నిద్రించుచున్నట్టి కోపించిన మహాసర్పముల వలె నుండగా హనుమ చూచెను. 19-21

రాకసరాజగు ఆ రావణుడు. అటి బలిసిన బాహువులు కలవాడె. శిఖరములు

పాండరే ణాపవిద్ధేన క్షౌమేణ క్షతజేక్షణమ్,
మహార్హేణ సుసంవీతం పీతే నోత్తమవాససా. 27

మాషరాశిప్రతీకాశం నిఃశ్వసంతం భుజంగవత్,
గాంగే మహతి తోయాంతే ప్రసుప్తమివ కుంజరమ్. 28

చతుర్భిః కాంచనై ర్దీపై ర్దీప్యమానచతుర్దిశమ్,
ప్రకాశీకృతసర్వాంగం మేఘం విద్యుద్గణై రివ. 29

పాదమూలగతా శ్చాపి దదర్శ సుమహాత్మనః,
పత్నీ స్స ప్రియభార్యస్య తస్య రక్షఃపతే ర్గృహే. 30

శశిప్రకాశవదనా శ్చారుకుండలభూషితాః,
అమ్లానమాల్యాభరణా దదర్శ హరియూథపః. 31

నృత్తవాదిత్రకుశలా రాక్షసేంద్రభుజాంకగాః,

---

ఉత్తరీయము ధరించినవాడును, విలువైన శ్రేష్ఠవస్త్రము దాల్చినవాడును, మినుములరాశి వలె నల్లగా నున్నవాడును, పామువలె నిట్టూర్చుచున్నవాడును, నాలుగు దిక్కులందును

వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః. 32
వజ్రవైడూర్యగర్భాణి శ్రవణాంతేషు యోషితామ్,
దదర్శ తాపనీయాని కుండలా న్యంగదాని చ . 33
తాసాం చంద్రోపమై ర్వక్త్రై శ్శుభై ర్లలితకుండలైః,
విరరాజ విమానం త న్నభ స్తారాగణై రివ. 34
మదవ్యాయామఖిన్నా స్తా రాక్షసేంద్రస్య యోషితః,
తేషు తే ష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః. 35
అంగహారై స్తథైవాన్యా కోమలై ర్నృత్తశాలినీ,
విన్యస్తశుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ. 36
కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే,

---

నిదురించుచుండగా చూచెను. 32

తమ భుజములపై తల లుంచుకొని నిదురించుచుండుటచే, ఆ స్త్రీలు ధరించిన

మహానదీప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా. 37

అన్యా కక్షగతేనైవ మడ్డుకే నాసితేక్షణా,
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా. 38

పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభస్తనీ,
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ. 39

కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా,
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ. 40

విపంచీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ,
నిద్రావశ మనుప్రాప్తా సహకాంతేవ భామినీ. 41

అన్యా కనకసంకాశై ర్మృదుపీనై ర్మనోరమైః,
మృదంగం పరిపీడ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా. 42

---

తామరతీగవలె వేరొకతె వీణను కౌగిలించుకొని నిదురించుచు ప్రకాశించుచుండెను. 37

భుజపార్శ్వాంతరస్థేన కక్షగేన కృశోదరీ,
పణవేన సహానింద్యా సుప్తా మదకృతశ్రమా. 43

డిండిమం పరిగృహ్యాన్యా తథై వాసక్తడిండిమా,
ప్రసుప్తా తరుణం వత్స ముపగూహ్యేవ భామినీ. 44

కాచి దాడంబరం నారీ భుజసంయోగపీడితమ్,
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా. 45

కలశీ మపవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ,
వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా. 46

పాణిభ్యాం చ కుచౌ కాచిత్ సువర్ణకలశోపమౌ,
ఉపగూ హ్యాబలా సుప్తా నిద్రాబలపరాజితా. 47

అన్యా కమలపత్రాక్షీ పూర్ణేందుసదృశాననా,

---

మచ్చులేని లావణ్యముగల యొక తలోదరి మదముచే అలసి, పణవ మను వాద్య విశేషమును భుజముల ప్రక్కగా, చంకలో నుంచుకొని నిద్రించెను. 43

అన్యా మాలింగ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా. 48
ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః,
నిపీడ్య చ కుచై స్సుప్తాః కామిన్యః కాముకానివ. 49
తాసా మేకాంతవిన్యస్తే శయానాం శయనే శుభే,
దదర్శ రూపసంపన్నా మపరాం స కపిః స్త్రియమ్. 50
ముక్తామణిసమాయుక్తై ర్భూషణై స్సువిభూషితామ్,
విభూషయంతీమివ తత్ స్వశ్రియా భవనోత్తమమ్. 51
గౌరీం కనకవర్ణాభా మిష్టా మంతఃపురేశ్వరీమ్,
కపి ర్మందోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్. 52
స తాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాత్మజః,

---

యగు మదవతి యొక్కతె చక్కని పిరుదులు గల వేరొకతెను కౌగిలించుకొని మత్తిలి నిదురించెను. 48

తర్కయామాస సీతేతి రూపయౌవనసంపదా.
హర్షేణ మహతా యుక్తో ననంద హరియూథపః. 53
ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననంద చిక్రీడ జగౌ జగామ,
స్తంభానరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్. 54

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే దశమః సర్గః.*

---

ఆమె సీతయే యని యూహించెను. వెంటనే

# 11. ఏకాదశః సర్గః

*(హనుమంతుడు రావణభవనమున సీతను వెదకుట)*

అవధూయ చ తాం బుద్ధిం బభూవావస్థిత స్తదా,
జగామ చాపరాం చింతాం సీతాం ప్రతి మహాకపిః. 1

న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ,
న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్,
నాన్యం నర ముపస్థాతుం సురాణామపి చేశ్వరమ్. 2

న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి,
అన్యేయ మితి నిశ్చిత్య పానభూమౌ చచార సః. 3

క్రీడితే నాపరాః క్లాంతా గీతేన చ తథాపరాః,
నృత్తేన చాపరాః క్లాంతా పానవిప్రహతా స్తథా. 4

మురజేషు మృదంగేషు పీఠికాసు చ సంస్థితాః,

---

హనుమంతు డామె మండోదరి యని, సీత కాదని తెలిసికొనగనే తన చపలభావమును విడచి, సీతనుగూర్చి వేరొక ఆలోచన కలవాడయ్యెను. 1

సీతాదేవి రాము నెడబాసి నిదురింపదు, భుజింపదు, అలంకరించుకొనదు,

తథాஉஉ స్తరణముఖ్యేషు సంవిష్టాశ్చాపరాః స్త్రియః. 5
అంగనానాం సహస్రేణ భూషితేన విభూషణైః,
రూపసల్లాపశీలేన యుక్తగీతార్థభాషిణా. 6
దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభిధాయినా,
రతాభిరతసంసుప్తం దదర్శ హరియూథపః. 7
తాసాం మధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః,
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథా వృషః. 8
స రాక్షసేంద్ర శ్శుశుభే తాభిః పరివృతః స్వయమ్,
కరేణుభి ర్యథారణ్యే పరికీర్ణో మహాద్విపః. 9
సర్వకామై రుపేతాం చ పానభూమిం మహాత్మనః,
దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతే ర్గృహే. 10

---

వారు మద్దెళ్ళపై, పీటలపై పాన్పులపై మేను వాల్చి నిదురించిరి. 4,5

అట్లు వివిధాలంకారములతో అలంకరించబడినవారును, తమ సౌందర్యమును (లేదా రావణసౌందర్యమును) వర్ణించువారును, ఆ యా సమయమునకు తగిన ...

మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః,
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః. 11
రౌక్మేషు చ విశాలేషు భాజనే ష్వర్ధభక్షితాన్,
దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాం స్తథా. 12
వరాహవార్ధ్రాణసకాన్ దధిసౌవర్చలాయుతాన్,
శల్యాన్ మృగమయూరాంశ్చ హనుమా నన్వవైక్షత. 13
క్రకరాన్ వివిధాన్ సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్,
మహిషా నేకశల్యాంశ్చ ఛాంగాంశ్చ కృతనిష్ఠితాన్. 14
లేహ్యానుచ్చావచాన్ పేయాన్ భోజ్యాని వివిధాని చ . 15
తథా౨౨ ౨ మ్లలవణోత్తంసై ర్వివిధై రాగషాడబైః,

---

ఆ పానభూమియందు హనుమ మృగములు, దున్నలు, వరాహముల మాంసములు వేర్వేరు పాత్రలలో నుండగా చూచెను. 11

విశాలములగు వెండిపాత్రలలో సగము తిని విడచిన నెమలి, కోడి మాంసములను హనుమ చూచెను. 12

వరాహములు, ఖడ్గమృగములు, ముండ్లపందులు, లేళ్ళు, నెమళ్ళ మాంసములును,

హారనూపురకేయూరై రపవిద్ధై ర్మహాధనైః. 16

పానభాజనవిక్షిప్తైః ఫలైశ్చ వివిధైరపి,

కృతపుష్పోపహారా భూ రధికం పుష్యతి శ్రియమ్. 17

తత్ర తత్ర చ విన్యస్తై స్సుశ్లిష్టై శ్శయనాసనైః,

పానభూమి ర్వినా వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే. 18

బహుప్రకారై ర్వివిధై ర్వరసంస్కారసంస్కృతైః,

మాంసైః కుశలసంపృక్తైః పానభూమిగతైః పృథక్. 19

దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి,

శర్కరాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః. 20

వాసచూర్ణైశ్చ వివిధై ర్మృష్టా స్తై స్తైః పృథక్ పృథక్,

సంతతా శుశుభే భూమి ర్మాల్యైశ్చ బహుసంస్థితైః. 21
హిరణ్మయైశ్చ వివిధై ర్భాజనైః స్ఫాటికై రపి,
జాంబూనదమయై శ్చాన్యైః కరకై రభిసంవృతా. 22
రాజతేషు చ కుంభేషు జాంబూనదమయేషు చ,
పానశ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శ హ. 23
సోஉ పశ్య చ్ఛాతకుంభాని శీధో ర్మణిమయాని చ,
రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః. 24
క్వచి దర్ధావశేషాణి క్వచిత్ పీతాని సర్వశః,
క్వచిన్నైవ ప్రపీతాని పానాని స దదర్శ హ. 25
క్వచి ద్భక్ష్యాంశ్చ వివిధాన్ క్వచిత్ పానాని భాగశః,
క్వచి దన్నావశేషాణి పశ్య న్వై విచచార హ. 26
క్వచిత్ ప్రభిన్నైః కరకైః క్వచి దాలోళితై ర్ఘటైః,

యుండెను. బంగారు పాత్రలు, స్ఫటిక పాత్రలు, బంగారు చెంబులతో ఆ పానభూమి
మిక్కిలి సుందరమై యుండెను. 20-22

క్వచిత్ సంపృక్తమాల్యాని జలాని చ ఫలాని చ. 27
శయనాన్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః,
పరస్పరం సమాశ్లిష్య కాశ్చి త్సుప్తా వరాంగనాః. 28
కాశ్చిచ్చ వస్త్ర మన్యస్యాః స్వపంత్యాః పరిధాయ చ,
ఆహృత్య చాబలాః సుప్తా నిద్రాబలపరాజితాః. 29
తాసా ముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్,
నాత్యర్థం స్పందతే చిత్రం ప్రాప్య మంద మివానిలమ్. 30
చందనస్య చ శీతస్య శీధో ర్మధురసస్య చ,
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ . 31
బహుధా మారుత స్తత్ర గంధం వివిధ ముద్వహన్,
స్నానానాం చందనానాం చ ధూపానాం చైవ మూర్ఛితః,
ప్రవవౌ సురభి ర్గంధో విమానే పుష్పకే తదా. 32

పూలమాలలు, కొన్నిచోట్ల నీరు, పండ్లు నుండగా హనుమ చూచెను. 27

శ్యామావదాతా స్తత్రాన్యాః కాశ్చిత్ కృష్ణా వరాంగనాః,
కాశ్చిత్ కాంచనవర్ణాంగ్యః ప్రమదా రాక్షసాలయే. 33

తాసాం నిద్రావశత్వాచ్చ మదనేన విమూర్ఛితమ్,
పద్మినీనాం ప్రసుప్తానాం రూప మాసీ ద్యథైవ హి. 34

ఏవం సర్వ మశేషేణ రావణాంతఃపురం కపిః,
దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్. 35

నిరీక్షమాణశ్చ తదా తాః స్త్రియ స్స మహాకపిః,
జగామ మహతీం చింతాం ధర్మసాధ్వసశంకితః. 36

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్,
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి. 37

న హి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ,
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః. 38

---

ఆ రావణుని కాంతలలో కొందరు నలుపు తెలుపుల మిశ్రమవర్ణము కలవారు, కొందరు నల్లనివారు, కొందరు సువర్ణచ్ఛాయ కలవారును ఉండిరి. 33

వారు రతిక్రీడలు సలిపి, నిద్రాపరవశ లగుటచే అలసిరి. వారి రూపములు

తస్య ప్రాదురభూ చ్చింతా పున రన్యా మనస్వినః,
నిశ్చితైకాంతచిత్తస్య కార్యనిశ్చయదర్శినీ. 39

కామం దృష్ట్వా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః,
న హి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే. 40

మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే,
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్. 41

నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్,
స్త్రియో హి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే. 42

యస్య సత్త్వస్య యా యోనిస్తస్యాం తత్ పరిమార్గ్యతే,
న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్. 43

తదిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా,

---

అని తలంచి, తదేకదృష్టితో ఆలోచించి కార్యనిశ్చయము చేసికొనిన ఆ హనుమంతునకు వేరొక విధమగు ఆలోచన కలిగెను. 39

రావణుని విశ్వాసము చూరగొనిన ఆతని కాంతల నెల్ల జూచితిని. అయినను

రావణాంతఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ. 44

దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ వీర్యవాన్,
అవేక్షమాణో హనుమా న్నైవాపశ్యత జానకీమ్. 45

తామపశ్యన్ కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః,
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే. 46

స భూయస్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః,
ఆపానభూమి ముత్సృజ్య తద్విచేతుం ప్రచక్రమే. 47

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే ఏకాదశః సర్గః.*

---

వెదకితిని. కాని ఆమె కనుపించుట లేదు. 44

ఇట్లు తలచి పరాక్రమశాలియగు హనుమంతుడు మఱల సీతాదేవికై వెదకుచు

# 12. ద్వాదశః సర్గః

*(సీత కనుపించకుండుటచే హనుమంతుడు చింతించుట)*

స తస్య మధ్యే భవనస్య మారుతి, ర్లతాగృహాం శ్చిత్రగృహా న్నిశాగృహాన్,
జగామ సీతాం ప్రతి దర్శనోత్సుకో,న చైవ తాం పశ్యతి చారుదర్శనామ్. 1
సచింతయామాస తతో మహాకపిః, ప్రియామపశ్యన్ రఘునందనస్య తామ్,
ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే, విచిన్వతో దర్శనమేతి మైథిలీ. 2
సా రాక్షసానాం ప్రవరేణ జానకీ, స్వశీలసంరక్షణతత్పరా సతీ,
అనేన నూనం ప్రతి దుష్టకర్మణా, హతా భవే దార్యపథే పరే స్థితా. 3
విరూపరూపా వికృతా వివర్చసో, మహాననా దీర్ఘవిరూపదర్శనాః,
సమీక్ష్య సా రాక్షసరాజయోషితో, భయాద్వినష్టా జనకేశ్వరాత్మజా. 4

---

హనుమంతు డా రావణభవనమునందు సీతాన్వేషణతత్పరుడై లతాగృహములను, చిత్తరువులుగల యిండ్లను, రాత్రి నివాసమునకు తగిన యిండ్లను చూచెను కాని యెచ్చటను సుందరనేత్రి యగు సీతాదేవిని చూడలేదు. 1

ఆ మహాకపి హనుమంతుడు ...

సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషం,విహృత్య కాలం సహ వానరైశ్చిరమ్,
న మేఽస్తి సుగ్రీవసమీపగా గతిః, సుతీక్ష్ణదండో బలవాంశ్చ వానరః. 5

దృష్ట మంతఃపురం సర్వం దృష్టా రావణయోషితః,
న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః. 6

కిన్ను మాం వానరా స్సర్వే గతం వక్ష్యంతి సంగతాః,
గత్వా తత్ర త్వయా వీర కిం కృతం తద్వదస్వ నః. 7

అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తా మహం జనకాత్మజామ్,
ధ్రువం ప్రాయ ముపైష్యంతి కాలస్య వ్యతివర్తనే. 8

కిం వా వక్ష్యతి వృద్ధశ్చ జాంబవా నంగదశ్చ సః,
గతం పారం సముద్రస్య వానరాశ్చ సమాగతాః. 9

అనిర్వేదః శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్,

---

సీతను కానక, శత్రువులపై పరాక్రమము చూపక, చాల తడవు వానరులతో గడపిన నాకు మా రాజగు సుగ్రీవుని చెంతకు పోవుటకు వీలుకాదు. ఆయన బలవంతుడు. తీవ్రదండన విధించువాడును [illegible] 5

అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. 10
కరోతి సఫలం జంతోః కర్మ యత్తత్ కరోతి సః,
తస్మాదనిర్వేదకృతం యత్నం చేష్టేఽహ ముత్తమమ్. 11
భూయస్తావ ద్విచేష్యామి దేశాన్ రావణపాలితాన్,
ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణి చ . 12
చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ,
నిష్కుటాంతరరథ్యాశ్చ విమానాని చ సర్వశః. 13
ఇతి సంచింత్య భూయోఽపి విచేతు ముపచక్రమే,
భూమీగృహాం శ్చైత్యగృహాన్ గృహాతిగృహకానపి. 14
ఉత్పత న్నిపతంశ్చాపి తిష్ఠన్ గచ్ఛన్ పునః పునః,
అపావృణ్వంశ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయన్. 15
ప్రవిశ న్నిష్పతం శ్చాపి ప్రపత న్నుత్పతన్నపి,

---

ఎలపుడు మనుజుని సకలకార్యములలో పాల్గొనునటు చేయును. అతడు చేయు

సర్వమ ప్యవకాశం స విచచార మహాకపిః. 16
చతురంగుళమాత్రోఽపి నావకాశ స్స విద్యతే,
రావణాంతఃపురే తస్మిన్ యం కపి ర్న జగామ సః. 17
ప్రాకారాంతరరథ్యాశ్చ వేదికా శ్చైత్యసంశ్రయాః,
దీర్ఘికాః పుష్కరిణ్యశ్చ సర్వం తేనావలోకితమ్. 18
రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా,
దృష్టా హనుమతా తత్ర న తు సా జనకాత్మజా. 19
రూపేణాప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః,
దృష్టా హనుమతా తత్ర న తు రాఘవనందినీ. 20
నాగకన్యా వరారోహాః పూర్ణచంద్రనిభాననాః,
దృష్టా హనుమతా తత్ర న తు సీతా సుమధ్యమా. 21

---

సకలావకాశములలో హనుమంతుడు సంచరించెను. 15,16

ప్రమథ్య రాక్షసేంద్రేణ నాగకన్యా బలాద్ధృతాః,
దృష్టా హనుమతా తత్ర న సా జనకనందినీ. 22

సోఽపశ్యం స్తాం మహాబాహుః పశ్యం శ్చాన్యా వరస్త్రియః,
విషసాద ముహుర్ధీమాన్ హనుమాన్ మారుతాత్మజః. 23

ఉద్యోగం వానరేంద్రాణాం ప్లవనం సాగరస్య చ,
వ్యర్థం వీక్ష్యాఽనిలసుత శ్చింతాం పున రుపాగమత్. 24

అవతీర్య విమానాచ్చ హనుమాన్ మారుతాత్మజః,
చింతా ముపజగా మాథ శోకోపహతచేతనః. 25

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే ద్వాదశః సర్గః.*

---

రావణునిచే బలాత్కారముగ తేబడిన నాగకన్యల నతడు చూచెను. కాని సీతను మాత్రము చూడలేదు. 22

మహాభుజుడు, ధీమంతుడు, వాయునందను డగు హనుమంతుడు సీతాదేవిని

# 13. త్రయోదశః సర్గః

*(హనుమ అశోకవనమున సీత నన్వేషింపదలంచుట)*

విమానాత్తు సుసంక్రమ్య ప్రాకారం హరియూథపః,
హనుమాన్ వేగవా నాసీ ద్యథా విద్యుద్ ఘనాంతరే. 1

సంపరిక్రమ్య హనుమాన్ రావణస్య నివేశనాత్,
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః. 2

భూయిష్ఠం లోళితా లంకా రామస్య చరతా ప్రియమ్,
న హి పశ్యామి వైదేహీం సీతాం సర్వాంగశోభనామ్. 3

పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా,
నద్యోఽనూపవనాంతాశ్చ దుర్గాశ్చ ధరణీధరాః,
లోళితా వసుధా సర్వా న తు పశ్యామి జానకీమ్. 4

---

వానరయూథప్రధానుడగు హనుమంతుడు విమానమునుండి ప్రాకారము పైకి దూకి, మేఘముల నడుమ మెఱపువలె వేగముగ పోయెను. 1

ఇహ సంపాతినా సీతా రావణస్య నివేశనే,
ఆఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తా మహమ్. 5
కిం ను సీతాఽథ వైదేహీ మైథిలీ జనకాత్మజా,
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్. 6
క్షిప్ర ముత్పతతో మన్యే సీతా మాదాయ రక్షసః,
బిభ్యతో రామబాణానా మంతరా పతితా భవేత్. 7
అథవా హ్రియమాణాయాః పథి సిద్ధనిషేవితే.
మన్యే పతితమార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్. 8
రావణ స్యోరువేగేన భుజాభ్యాం పీడితేన చ,
తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా. 9
ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తథా,

---

గృధ్రరాజగు సంపాతి సీత రావణు నింట ఉన్నదని చెప్పినాడు. కాని నా కామె యిచ్చట కానరాకున్నది. 5

వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా. 10
అహో క్షుద్రేణ వాఽనేన రక్షంతీ శీల మాత్మనః,
అబంధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ. 11
అథవా రాక్షసేంద్రస్య పత్నీభి రసితేక్షణా,
అదుష్టా దుష్టభావాభి ర్భక్షితా సా భవిష్యతి. 12
సంపూర్ణచంద్రప్రతిమం పద్మపత్రనిభేక్షణమ్,
రామస్య ధ్యాయతీ వక్త్రం పంచత్వం కృపణా గతా. 13
హా రామ లక్ష్మణే త్యేవం హాఽయోధ్యే చేతి మైథిలీ,
విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి. 14
అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే,
నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా. 15
జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా,

---

దొఱలి సముద్రమున పడియుండును. 10
అయ్యో! బంధువులు చెంతలేని దీనురా లగు సీత తన శీలము గాపాడుకొనుచు

కథ ముత్పలపత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్. 16

వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా,
రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్. 17

నివేద్యమానే దోషః స్యాత్ దోషః స్యా దనివేదనే,
కథం ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే. 18

అస్మి న్నేవంగతే కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిమ్,
భవేదితి మతం భూయో హనుమాన్ ప్రవిచారయత్. 19

యది సీతా మదృష్ట్వాఽహం వానరేంద్రపురీ మితః,
గమిష్యామి తతః కో మే పురుషార్థో భవిష్యతి. 20

మమేదం లంఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి,
ప్రవేశశ్చైవ లంకాయా రాక్షసానాం చ దర్శనమ్. 21

---

కన్నులు కలది యగు సీత యెట్లు రావణుని వశమగును? 16

సీతను భూగృహాదులలో దాచియుంచుటచే ఆమె కనుపించకున్నను, సముద్ర పతనాదులచేత ప్రాణములు వీడినను, రామునితో ఎడబాటుచే స్వయముగనే

కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః,
కిష్కింధాం సమనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ. 22

గత్వా తు యది కాకుత్స్థం వక్ష్యామి పర మప్రియమ్,
న దృష్టేతి మయా సీతా తత స్త్యక్ష్యతి జీవితమ్. 23

పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియతాపనమ్,
సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా స న భవిష్యతి. 24

తం తు కృచ్ఛ్రగతం దృష్ట్వా పంచత్వగతమానసమ్,
భృశానురక్తో మేధావీ న భవిష్యతి లక్ష్మణః. 25

వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోఽపి మరిష్యతి,
భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి. 26

పుత్రాన్ మృతాన్ సమీక్ష్యాథ న భవిష్యంతి మాతరః,

---

కిష్కింధ కేతెంచిన నన్ను చూచి మా రాజు సుగ్రీవుడు, నన్ను కలసికొన్న తక్కిన

కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న సంశయః. 27

కృతజ్ఞ స్సత్యసంధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః,
రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్. 28

దుర్మనా వ్యథితా దీనా నిరానందా తపస్వినీ,
పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్. 29

వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా,
పంచత్వం చ గతే రాజ్ఞి తారాఽపి న భవిష్యతి. 30

మాతాపిత్రో ర్వినాశేన సుగ్రీవవ్యసనేన చ,
కుమారోఽప్యంగదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్. 31

భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః,
శిరాం స్యభిహనిష్యంతి తలై ర్ముష్టిభిరేవ చ. 32

---

జీవింప రనుట నిస్సంశయము. 27

కృతజ్ఞుడు, సత్యసంధుడు, వానరరాజగు సుగ్రీవుడు రాముని యా దురవస్థను జూచి వెంటనే ప్రాణములు వీడును. 28

సాంత్వే నానుప్రదానేన మానేన చ యశస్వినా,
లాలితాః కపిరాజేన ప్రాణాం స్త్యక్ష్యంతి వానరాః. 33

న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః,
క్రీడా మనుభవిష్యంతి సమేత్య కపికుంజరాః. 34

సపుత్రదారా స్సామాత్యా భర్తృవ్యసనపీడితాః,
శైలాగ్రేభ్యః పతిష్యంతి సమేత్య విషమేషు చ. 35

విష ముద్బంధనం వాపి ప్రవేశం జ్వలనస్య వా,
ఉపవాస మథో శస్త్రం ప్రచరిష్యంతి వానరాః. 36

ఘోర మారోదనం మన్యే గతే మయి భవిష్యతి,
ఇక్ష్వాకుకులనాశశ్చ నాశశ్చైవ వనౌకసామ్. 37

సోఽహం నైవ గమిష్యామి కిష్కింధాం నగరీ మితః,
న చ శక్ష్యామ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం వినా. 38

---

ఆయన లేక జీవింపరు. 33

సుగ్రీవు నెడబాసిన వానరశ్రేష్ఠు లరణ్యమందుగాని, కొండలపై గాని, గృహాదులందు
[illegible] 34

మయ్యగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ,
ఆశయా తౌ ధరిష్యేతే వానరాశ్చ మనస్వినః. 39

హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః,
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్. 40

సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే,
చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీసుతమ్. 41

ఉపవిష్టస్య వా సమ్యగ్ లింగినీం సాధయిష్యతః,
శరీరం భక్షయిష్యంతి వాయసాః శ్వాపదాని చ . 42

ఇదం మహర్షిభి ర్దృష్టం నిర్యాణ మితి మే మతిః,
సమ్యగాపః ప్రవేక్ష్యామి న చేత్ పశ్యామి జానకీమ్. 43

---

నే నిటనుండి పోవక, యిచటనే యున్నచో, ధర్మాత్ములు మహారథులగు రామలక్ష్మణులు, మంచి మనస్సుకల వానరులు సీతాదేవిని చూడగల మను ఆశతో

సుజాతమూలా సుభగా కీర్తిమూలా యశస్వినీ,
ప్రభగ్నా చిరరాత్రీయం మమ సీతా మపశ్యతః. 44
తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః,
నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వాఽసితేక్షణామ్. 45
యదీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్య తామ్,
అంగద స్సహ తై స్సర్వై ర్వానరై ర్న భవిష్యతి. 46
వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి,
తస్మాత్ ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసంగమః. 47
ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయన్ ముహుః,
నాధ్యగచ్ఛ త్తదా పారం శోకస్య కపికుంజరః. 48

---

సీతాన్వేషణమున కనువుగా వెన్నెల కాయుటచే సుందరమైనది, హనుమంతుని

రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్,
కామమస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి. 49
అథ వైనం సముత్క్షిప్య ఉపర్యుపరి సాగరమ్,
రామా యోపహరిష్యామి పశుం పశుపతే రివ. 50
ఇతి చింతాం సమాపన్నః సీతా మనధిగమ్య తామ్,
ధ్యానశోకపరీతాత్మా చింతయామాస వానరః. 51
యావత్ సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్,
తావ దేతాం పురీం లంకాం విచినోమి పునః పునః. 52
సంపాతివచనా చ్చాపి రామం య ద్యానయా మ్యహమ్,
అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహేత్ సర్వవానరాన్. 53
ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేంద్రియః,
న మత్కృతే వినశ్యేయు స్సర్వే తే నరవానరాః. 54

---

సీత విషయ మట్లుండుగాక. మహాబలుడు, దశగ్రీవుడగు రావణుని వధింతును. దీనిచే వైరమునకు ప్రతీకారము కాగలదు. 49

అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా,
ఇమా మధిగమిష్యామి న హీయం విచితా మయా. 55
వసూన్ రుద్రాంస్తథాఽఽదిత్యానశ్వినౌ మరుతోఽపి చ,
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః. 56
జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకులనందినీమ్,
సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే. 57
స ముహూర్తమివ ధ్యాత్వా చింతావగ్రథితేంద్రియః,
ఉదతిష్ఠ న్మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. 58
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ, దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో, నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః
స తేభ్యస్తు నమస్కృత్య సుగ్రీవాయ చ మారుతిః,

---

ఈ అశోకవనము పెద్ద పెద్ద మ్రానులతో కూడియున్నది. సీత యిం దున్నదేమో చూచెదను. ఈ వన మింతకుముందు నేను వెదకనిదే. 55

వసువులకు, రుద్రులకు, ఆదిత్యులకు, అశ్వినులకు, వాయువునకు నమస్కరించి

దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోకవనికాం ప్రతి. 60

స గత్వా మనసా పూర్వ మశోకవనికాం శుభామ్,
ఉత్తరం చింతయామాస వానరో మారుతాత్మజః. 61

ధ్రువం తు రక్షోబహులా భవిష్యతి వనాకులా,
అశోకవనికా చింత్యా సర్వసంస్కారసంస్కృతా. 62

రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షంతి పాదపాన్,
భగవానపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై. 63

సంక్షిప్తోఽయం మయాత్మా చ రామార్థే రావణస్య చ,
సిద్ధిం మే సంవిధాస్యంతి దేవా స్సర్షిగణా స్త్విహ. 64

బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవ దిశంతు మే,
సిద్ధి మగ్నిశ్చ వాయుశ్చ పురుహూతశ్చ వజ్రభృత్. 65

---

నమస్కరించి, అశోకవన మెంత విశాలమో తెలియగోరి దిక్కు లన్నియు పరిశీలించెను. 60

హనుమంతు డట్లు ముందుగా మనస్సుచేతనే శుభకరమగు అశోకవనమున ప్రవేశించి (ప్రవేశింపవలెనని మదిలో నిశ్చయించి) అనంతరకర్తవ్య మాలోచించెను. 61

వరుణః పాశహస్తశ్చ సోమాదిత్యౌ తథైవ చ,
అశ్వినౌ చ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవ చ. 66

సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః,
దాస్యంతి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః. 67

తదున్నసం పాండురదంత మవ్రణం, శుచిస్మితం పద్మపలాశలోచనమ్,
ద్రక్ష్యే తదార్యావదనం కదా న్వహం, ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్. 68

క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా, సుదారుణాలంకృతవేషధారిణా,
బలాభిభూతా హ్యబలా తపస్వినీ, కథం ను మే దృష్టిపథేఽద్య సా భవేత్. 69

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే త్రయోదశః సర్గః*

---

వరుణుడును, సూర్య చంద్రులును, మహాత్ములగు అశ్వినీదేవతలును, మరుత్తులును, శివుడును నాకు కార్యసిద్ధిని కలిగింతురుగాక. 65,66

సకలభూతములును, ఆ భూతములకు ప్రభువు (పూర్వోక్తబ్రహ్మారుద్రాదుల కధిపతి)

# 14. చతుర్దశః సర్గః

*(హనుమ అశోకవనములో సీతను వెదకుట)*

స ముహూర్తమివ ధ్యాత్వా మనసా చాధిగమ్య తామ్,
అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః. 1
స తు సంహృష్టసర్వాంగః ప్రాకారస్థో మహాకపిః,
పుష్పితాగ్రాన్ వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్. 2
సాలా నశోకాన్ భవ్యాంశ్చ చంపకాంశ్చ సుపుష్పితాన్,
ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతాన్ కపిముఖా నపి. 3
అథామ్రవణసంఛన్నాం లతాశతసమావృతామ్,
జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్. 4
స ప్రవిశ్య విచిత్రాం తాం విహగై రభినాదితామ్,

---

మహాతేజస్వి యగు హనుమంతు డొకింత తడ వాలోచించి, సీతాదేవిని మదిలో తలంచి, రావణభవనమునుండి అశోకవనప్రాకారమును చేరెను. 1

హనుమంతు డా ప్రాకారముపై కూర్చుండి సర్వాంగములు పులకింపగా. వసంతా

రాజతైః కాంచనై శ్చైవ పాదపై స్సర్వతో వృతామ్. 5
విహగైర్ మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమాన్ కపిః. 6
వృతాం నానావిధైర్ వృక్షైః పుష్పోపగఫలోపగైః,
కోకిలైర్ భృంగరాజైశ్చ మత్తైర్నిత్యనిషేవితామ్. 7
ప్రహృష్టమనుజే కాలే మృగపక్షిసమాకులే,
మత్తబర్హిణసంఘుష్టాం నానాద్విజగణాయుతామ్. 8
మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిందితామ్,
సుఖప్రసుప్తాన్ విహగాన్ బోధయామాస వానరః. 9
ఉత్పతద్భిర్ ద్విజగణైః పక్షై స్సాలా స్సమాహతాః,
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః. 10

---

ప్రారంభకాలమున అశోకవనిలో ప్రవేశించెను. ఆ వనము పక్షుల కిలకిలారావములతో
కూడినదై చుట్టును వెండి బంగారు వన్నె చెట్లతో నిండియుండెను. నానావిధపక్షులు

పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమాన్ మారుతాత్మజః,
అశోకవనికామధ్యే యథా పుష్పమయో గిరిః. 11
దిశ స్సర్వాః ప్రధావంతం వృక్షషండగతం కపిమ్,
దృష్ట్వా సర్వాణి భూతాని వసంత ఇతి మేనిరే. 12
వృక్షేభ్యః పతితైః పుష్పై రవకీర్ణా పృథగ్విధైః,
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా. 13
తరస్వినా తే తరవ స్తరసాఽభిప్రకంపితాః,
కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా. 14
నిర్ధూతపత్రశిఖరా శ్శీర్ణపుష్పఫలా ద్రుమాః,
నిక్షిప్తవస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః. 15
హనూమతా వేగవతా కంపితాస్తే నగోత్తమాః,

---

వాయుపుత్రు డగు హనుమంతు డా పుష్పములతో నిండినవాడై అశోక వనమధ్యమున పూలకొండ వలె శోభిల్లెను. 11

చెట్ల గుంపులో నుండి అన్ని దిశలకు పరుగెత్తుటచే ...

పుష్పపర్ణఫలా న్యాశు ముముచుః పుష్పశాలినః. 16
విహంగసంఘైర్హీనా స్తే స్కంధమాత్రాశ్రయా ద్రుమాః,
బభూవు రగమా స్సర్వే మారుతేనేవ నిర్ధుతాః. 17
నిర్ధూతకేశీ యువతి ర్యథా మృదితవర్ణకా,
నిష్పీతశుభదంతోష్ఠీ నఖై ర్దంతైశ్చ విక్షతా. 18
తథా లాంగూలహస్తైశ్చ చరణాభ్యాం చ మర్దితా,
బభూ వాశోకవనికా ప్రభగ్నవరపాదపా. 19
మహాలతానాం దామాని వ్యధమ త్తరసా కపిః,
యథా ప్రావృషి వింధ్యస్య మేఘజాలాని మారుతః. 20
స తత్ర మణిభూమీశ్చ రాజతీశ్చ మనోరమాః,
తథా కాంచనభూమీశ్చ దదర్శ విచరన్ కపిః. 21

---

అవి పూలను, ఆకులను, పండ్లను శీఘ్రమే రాల్చినవి. 16

అట్లు హనుమంతుడు కదల్చిన ఆ వృక్షములు, గాలికి కంపించినవి వలె పక్షి

వాపీశ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా,
మహార్హై ర్మణిసోపానై రుపపన్నా స్తత స్తతః. 22

ముక్తాప్రవాళసికతాః స్ఫాటికాంతరకుట్టిమాః,
కాంచనై స్తరుభి శ్చిత్రై స్తీరజై రుపశోభితాః. 23

ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోపకూజితాః,
నత్యూహరుతసంఘుష్టా హంససారసనాదితాః. 24

దీర్ఘాభిర్ ద్రుమయుక్తాభి స్సరిద్భిశ్చ సమంతతః,
అమృతోపమతోయాభి శ్శివాభి రుపసంస్కృతాః. 25

లతాశతై రవతతా స్సంతానకుసుమావృతాః,
నానాగుల్మావృతఘనాః కరవీరకృతాంతరాః. 26

అట్లే నిర్మలజలములు కల పలు ఆకృతులు కల దిగుడుబావులను హనుమ చూచెను. అవి యట నట అనర్ఘములు, మణిఖచితములగు సోపానములతో కూడియుండెను.

22

తతోఽమ్బుధరసంకాశం ప్రవృద్ధశిఖరం గిరిమ్,
విచిత్రకూటం కూటైశ్చ సర్వతః పరివారితమ్. 27
శిలాగృహై రవతతం నానావృక్షై స్సమావృతమ్,
దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్. 28
దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః,
అంకాదివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్. 29
జలే నిపతితాగ్రైశ్చ పాదపై రుపశోభితామ్,
వార్యమాణామివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబంధుభిః. 30
పున రావృత్తతోయాం చ దదర్శ స మహాకపిః,
ప్రసన్నామివ కాంతస్య కాంతాం పునరుపస్థితామ్. 31
తస్యాదూరాత్ స పద్మిన్యో నానాద్విజగణాయుతాః,
దదర్శ హరిశార్దూలో హనుమాన్ మారుతాత్మజః. 32

---

హనుమంతు డట నొక సుందరపర్వతమును చూచెను. దాని శిఖరములు చాల ఎత్తుగా నుండి, విచిత్రములై ఎల్లెడల వ్యాపించెను. ఆ కొండ మేఘమువలె నుండెను.
27,28

కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా,
మణిప్రవరసోపానాం ముక్తాసికతశోభితామ్. 33

వివిధైర్ మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్,
ప్రాసాదై స్సుమహద్భిశ్చ నిర్మితై ర్విశ్వకర్మణా. 34

కాననైః కృత్రిమైశ్చాపి సర్వత స్సమలంకృతామ్. 35

యే కేచిత్ పాదపా స్తత్ర పుష్పోపగఫలోపగాః,
సచ్ఛత్రా స్సవితర్దీకా స్సర్వే సౌవర్ణవేదికాః. 36

లతాప్రతానై ర్బహుభిః పర్ణైశ్చ బహుభి ర్వృతామ్,
కాంచనీం శింశుపా మేకాం దదర్శ హనుమాన్ కపిః.
వృతాం హేమమయీభిస్తు వేదికాభి స్సమంతతః. 37

సోఽపశ్య ద్భూమిభాగాంశ్చ గర్తప్రస్రవణాని చ,
సువర్ణవృక్షా నపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్. 38

---

హనుమంతు దచట చల్లని నీటితో నిండినది, శ్రేష్ఠములగు మణులు పొదుగబడిన మెట్లు గలది, ముత్యముల ఇసుకతో శోభిల్లునది, అనేక పశు సమూహములతో

తేషాం ద్రుమాణాం ప్రభయా మేరో రివ దివాకరః,
అమన్యత తదా వీరః కాంచనోఽ స్మీతి వానరః. 39

తాం కాంచనై స్తరుగణై ర్మారుతేన చ వీజితామ్,
కింకిణీశతనిర్ఘోషాం దృష్ట్వా విస్మయ మాగమత్. 40

స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాంకురపల్లవామ్,
తామారుహ్యా మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్. 41

ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శనలాలసామ్,
ఇతశ్చేతశ్చ దుఃఖార్తాం సంపతంతీం యదృచ్ఛయా. 42

అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః,
చంపకై శ్చందనైశ్చాపి వకుళైశ్చ విభూషితా. 43

ఇయం చ నళినీ రమ్యా ద్విజసంఘనిషేవితా,
ఇమాం సా రామమహిషీ నూన మేష్యతి జానకీ. 44

---

హనుమ తాను బంగారు దేహము కలవాడనని తలంచెను. 39

ఆయన బంగారు చెటతో కూడినదియు, వాయువుచే వీచబడినదియు, అనేకములగు

సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ,
వనసంచారకుశలా నూన మేష్యతి జానకీ. 45

అథవా మృగశాబాక్షీ వనస్యాస్య విచక్షణా,
వనమేష్యతి సార్యేహ రామచింతానుకర్శితా. 46

రామశోకాభిసంతప్తా సా దేవీ వామలోచనా,
వనవాసే రతా నిత్య మేష్యతే వనచారిణీ. 47

వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా,
రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ. 48

సంధ్యాకాలమనా శ్యామా ధ్రువమేష్యతి జానకీ,
నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ. 49

తస్యా శ్చాప్యనురూపేయ మశోకవనికా శుభా,

---

రాముని ఇల్లాలు, ఆయనకు ప్రియము గూర్చునది, అడవిలో తిరుగుటలో నేర్పుగలదగుటచే జానకి తప్పక యిట కేతెంచును. 45

లేగా లేడిపిల్ల చూపులవంటి చూపులు కలది. ఈ విహారమునకు తగిన ఎరుక

శుభా యా పార్థివేంద్రస్య పత్నీ రామస్య సమ్మతా. 50
యది జీవతి సా దేవీ తారాధిపనిభాననా,
ఆగమిష్యతి సావశ్య మిమాం శివజలాం నదీమ్. 51
ఏవం తు మత్వా హనుమా న్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేంద్రపత్నీమ్,
అవేక్షమాణశ్చ దదర్శ సర్వం
సుపుష్పితే పర్ణఘనే నిలీనః. 52

*ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే సుందరకాండే చతుర్దశః సర్గః.*

---

రాజశ్రేష్ఠుడగు రామునకు పత్ని, తన శుభాచరణముచే భర్తృసమ్మతయు అగు సీత కీ శుభమగు అశోకవనము తగియున్నది. 50

# 15. పంచదశః సర్గః

*(హనుమంతు డశోకవనమందు సీతను దర్శించుట)*

స వీక్షమాణ స్తత్రస్థో మార్గమాణశ్చ మైథిలీమ్,
అవేక్షమాణశ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత. 1

సంతానకలతాభిశ్చ పాదపై రుపశోభితామ్,
దివ్యగంధరసోపేతాం సర్వత స్సమలంకృతామ్. 2

తాం స నందనసంకాశాం మృగపక్షిభి రావృతామ్,
హర్మ్యప్రాసాదసంబాధాం కోకిలాకులనిస్వనామ్. 3

కాంచనోత్పలపద్మాభి ర్వాపీభి రుపశోభితామ్,
బహ్వాసనకుథోపేతాం బహుభూమిగృహాయుతామ్. 4

సర్వర్తుకుసుమై రమ్యాం ఫలవద్భిశ్చ పాదపైః,

---

హనుమంతు డా శింశుపావృక్షముపై గూర్చుండి, యటనుండి సీతను వెదకుచు భూమిపై నలుదిక్కుల తన దృష్టిని ప్రసరింపజేసెను. 1

పుష్పితానా మశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్,
ప్రదీప్తామివ తత్రస్థో మారుతి స్సముదైక్షత. 5
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మివాసకృత్. 6
వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః,
ఆమూలపుష్పనిచితై రశోకై శ్శోకనాశనైః. 7
పుష్పభారాతిభారైశ్చ స్పృశద్భిరివ మేదినీమ్,
కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః. 8
స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః. 9
పున్నాగా స్సప్తపర్ణాశ్చ చంపకోద్దాలకా స్తథా,
వివృద్ధమూలా బహవ శ్శోభంతే స్మ సుపుష్పితాః. 10

---

యుండెను. ఎర్రగా పూసిన అశోకముల శోభచే సూర్యోదయకాంతి కల ఆ వనము
వెలుగుచున్నదో అన్నట్లు ఉండగా హనుమంతుడు చూచెను. 5
మాటిమాటికి ఱెక్కలను విదలించుకొను వందలాది పక్షు లీ అశోకవనమును

శాతకుంభనిభాః కేచిత్ కేచి దగ్నిశిఖోపమాః,
నీలాంజననిభాః కేచి త్తత్రాశోకా స్సహస్రశః. 11
నందనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా,
అతివృత్త మివాచింత్యం దివ్యం రమ్యం శ్రియా వృతమ్.
ద్వితీయమివ చాకాశం పుష్పజ్యోతిర్గణాయుతమ్. 12
పుష్పరత్నశతై శ్చిత్రం పంచమం సాగరం యథా,
సర్వర్తుపుష్పై ర్నిచితం పాదపై ర్మధుగంధిభిః. 13
నానానినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః,
అనేకగంధప్రవహం పుణ్యగంధం మనోరమమ్.
శైలేంద్రమివ గంధాఢ్యం ద్వితీయం గంధమాదనమ్. 14
అశోకవనికాయాం తు తస్యాం వానరపుంగవః,

---

ఆ యశోకపుష్పములలో కొన్ని బంగారు వన్నె, కొన్ని అగ్నిజ్వాల వర్ణము, కొన్ని కాటుక రంగు కలిగియుండెను. అవి వేల సంఖ్యలో నుండెను. వానితో నా యశోకవన...

స దదర్శావిదూరస్థం చైత్యప్రాసాద ముచ్ఛ్రితమ్, 15
మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురమ్,
ప్రవాళకృతసోపానం తప్తకాంచనవేదికమ్. 16
ముష్ణంత మివ చక్షూంషి ద్యోతమాన మివ శ్రియా,
విమలం ప్రాంశుభావత్వా దుల్లిఖంత మివాంబరమ్. 17
తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్,
ఉపవాసకృశాం దీనాం నిశ్వసంతీం పునః పునః,
దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖా మివామలామ్. 18
మందం ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్,
పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః. 19

---

చూచెను. అది వేయి స్తంభములు కలిగి, మిక్కిలి ఎత్తైనదై, కైలాసపర్వతమువలె తెల్లనై ప్రకాశించు చుండెను. ఆ భవనపు మెట్లు పగడములతో పొదుగబడెను. వేదికలు

పీతే నైకేన సంవీతాం క్లిష్టే నోత్తమవాససా,
సపంకా మనలంకారాం విపద్మామివ పద్మినీమ్. 20

వ్రీళితాం దుఃఖసంతప్తాం పరిమ్లానాం తపస్వినీమ్,
గ్రహే ణాంగారకే ణేవ పీడితా మివ రోహిణీమ్. 21

అశ్రుపూర్ణముఖీం దీనాం కృశా మనశనేన చ,
శోకధ్యానపరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్. 22

ప్రియం జన మపశ్యంతీం పశ్యంతీం రాక్షసీగణమ్,
స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతా మివ. 23

నీలనాగాభయా వేణ్యా జఘనం గత యైకయా,
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీమివ. 24

---

జీర్ణమై పసుపు పచ్చని యొకే ప్రధానవస్త్రము ధరించినదై , శరీరమునకు సంస్కారములు (స్నానము మొ॥) లేమిచే భూమినుండి యావిర్భవించినదో యన్నటులు మురికి గల్గి, ఆభరణములు

సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానా మకోవిదామ్,
తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్,
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః. 25
హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా,
యథారూపా హి దృష్టా వై తథారూపేయ మంగనా. 26
పూర్ణచంద్రాననాం సుభ్రూం చారువృత్తపయోధరామ్,
కుర్వంతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః. 27
తాం నీలకేశీం బింబోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్,
సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా. 28
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచంద్రప్రభామివ,

---

రాజపుత్రి యగుటచే, సుఖము లనుభవింపదగియు దుఃఖ మనుభవించుచున్నదియు, మున్నెన్నడు కష్టముల నెఱుగనిదియు, విశాలనేత్రములు కలదియు, మిగుల మలినయై చిక్కియున్న ఆమెను హనుమంతుడు చూచి యుక్తియుక్తములగు చెప్పబోవు కారణములచే

భూమౌ సుతను మాసీనాం నియతామివ తాపసీమ్. 29
నిశ్శ్వాసబహులాం భీరుం భుజగేంద్రవధూమివ. 30
శోకజాలేన మహతా వితతేన న రాజతీమ్,
సంసక్తాం ధూమజాలేన శిఖామివ విభావసోః. 31
తాం స్మృతీమివ సందిగ్ధా మృద్ధిం నిపతితా మివ,
విహతామివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతామివ. 32
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషామివ,
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ. 33
రామోపరోధవ్యథితాం రక్షోహరణకర్శితామ్,
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తత స్తతః. 34
బాష్పాంబుపరిపూర్ణేన కృష్ణవక్రాక్షిపక్ష్మణా,

ప్రీతిపాత్రురాలై, సుందరరూపముకలదై తపస్విని వలె నియమవతియై, భూమిపై కూర్చుండి, భయముతో నిట్టూర్చుచు సర్పరాజకన్యవలె నుండెను. 29,30

వదనే నాప్రసన్నేన నిఃశ్వసంతీం పునః పునః. 35
మలపంకధరాం దీనాం మండనార్హా మమండితామ్,
ప్రభాం నక్షత్రరాజస్య కాలమేఘై రివావృతామ్. 36
తస్య సందిదిహే బుద్ధి ర్ముహు స్సీతాం నిరీక్ష్య తు,
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ. 37
దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్,
సంస్కారేణ యథా హీనాం వాచమర్థాంతరం గతామ్. 38
తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిందితామ్,
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః. 39
వైదేహ్యా యాని చాంగేషు తదా రామోఽ న్వకీర్తయత్,

---

ఆమె మాటిమాటికి నిట్టూర్చుచుండెను. 35

ఆమె శరీరము మురికిగా నుండెను. ముఖమున దైన్య ముట్టిపడుచుండెను. అలంకరించు కొనదగియు నామె యలంకరించుకొనలేదు. ఇటామె కారుమేఘములు

